
సువర్ణ
సుందరికి
సుగంధ
చందనం
గోకుల్ సాంటాల్ పౌడరును మీ శరీర మంతా వాడండి. మీరు ఇంతవరకు కానని సుగంధ చందన సువాసనను అనుభవించండి.
గోకుల్
సాంటాల్ టాయిలెట్ పౌడరు
తయారీలు :
టి.యస్.ఆర్. &
కంపెని, మద్రాసు
మద్రాసు-88
ADWAVE TSR 19 TEL


మనసు మురిపించే ఫ్రెస్కో
ఫ్రెస్కో బ్యూటీ టాల్కం.
మనోహరమైన, హాయిని గొలిపే
సువాసనను, స్వచ్ఛమైన సౌందర్య
మును మీ మీద వెదజల్లును.
ఫ్రెస్కో, దాని ప్రత్యేకమైన
మృదుత్వముతో మీ రూపమునకు
మెరుగులు దిద్దును
ఫ్రెస్కో మృదువైనది, సువాసన
గలది— మీకు తాజా పూరితమైన
ఉత్సాహమును గొల్పును.
అందువలన ఫ్రెస్కోతో
రమణీయంగా వుండండి.
రెండు సైజులలో లభించును—.
ఫ్రెస్కో బ్యూటీ టాల్క్
గోద్రెజ్ తయారీ
పోటీలేని తాజాదనమునకు ఫ్రెస్కో!

## మళ్ళీ పుట్టాలి

కాదనకు బాపూ నీవు మళ్ళీ పుట్టాలి.
రావనకు బాపూ నీవు మళ్ళీ పుట్టాలి...

ద్వారానికి నీ చిత్రపటం తగిలించి
ద్వార పాలకానికి నిను వినియోగించి
నీపేరుపయోగించి— మాపరపతిని పెంచి
దుర్వినియోగపు కంచ— ప్రగతికి బిగించాం.

నీవు కను మరుగై పోయావని.
మరుగ బెట్టాము నీ ధ్యేయం.
నీవిక మళ్ళీ రావని మాధైర్యం.
మర్చిపోయాము. నీ సందేశం.

అందుకే అనుభవిస్తున్నాం.
చావలేని బ్రతుకుసారం.
అంధకార బంధురాన మెలిగి
దరిద్ర కబంధ హస్తాల నలిగి.

కలలు గన్న నీ భారతదేశం.
నిక్కృష్టానికి పోతున్న తరుణం
మావునంవిడు బాపూ—మాపై.
కరుణ జూపు బాపూ....

రెండు దశాబ్దాల పునాదులను
మొదలంటి వేళ్ళతో పెకలించిన.
నీ చిరునవ్వు తోడు రావాలి.
నీ సహనం తిరిగి రావాలి.

కాదనకు బాపూ నీవుమళ్ళీ పుట్టాలి.
రావనకు బాపూ నీవుమళ్ళీ పుట్టాలి.
శాంతివనాన పూలుమళ్ళీ పూయాలి— ఈ
జన్మ దినాన నీవు మళ్ళీ పుట్టాలి.

—మొదలి శ్రీరామ ప్రసాద్

## ముఖచిత్రం

శోభన్‌బాబు, శారద ముఖచిత్రం మాకు చాలా నచ్చింది. మరియు చాలా లక్షణముగా ఉన్నది. చాల రోజులనుండీ అనుకున్న కల ఇప్పుడు తీరింది. ఆ చిత్రాన్ని గంటసేపుదాకా అలాగే చూస్తూఉండి పోయానంటె నమ్మండి.

కుమారి ముత్తు, (రాయచూరు)

## కథలు

1—9—1972 సంచికలోని 'మబ్బుతెరలు' అనే కథలో రచయిత్రి 'పల్లవి' మీద అభిమానంతో మాధవరావు, 'పంకజ్' మీద అభిమానంతో శాంతిప్రియ భేదాభిప్రాయాలు పడినట్లు వ్రాసారు.. కాని ఒకరు వ్రాసినది మంొకరు (వారికి తెలియక పోయినప్పటికీ) మెచ్చుకొంటుంటే అక్కడ భేదాభిప్రాయాలు రావటానికి తావులేదు గదా! రచయిత్రి ఇది గమనించగోర్తాను.

జ్యోత్స్న, (హన్మకొండ)

# ఉత్తరాలు

## సీరియల్

విద్యార్థి సీరియల్ నవల చాలా బాగుంటున్నాది. చాలా సాఫీగా నడచిపోతున్నది. 1—9—72 తారీఖు పత్రిక చదివాను. అందులో చిన్న పొరపాటు కన్పిస్తున్నాది.

అందులో విద్యార్థి జ్ఞానాంబతో ఆమె పుస్తకాలు అతని లైబ్రరీ టికట్టుమీద, అతని పుస్తకాలు ఆమె లైబ్రరీ టికట్ మీద లైబ్రరీనుండి తెస్తానంటాడు.

ఇక్కడ నిబంధనల ప్రకారం విద్యార్థి తన టికట్ మీద ఆమెపుస్తకాలు తేవచ్చుగాని, జ్ఞానంబ టికట్ మీద అతని పుస్తకాలు ఆమెకొరకు తేలేదు, ఈ పొరపాటు గమనించ ప్రార్థన.

——కె. ఎల్. ఎన్. రావు, (బొంబాయి)

## కార్టూన్ సీరియల్

మంచి సస్పెన్స్‌తో, పత్రిక చేతికి రాగానే మొదట చదువ బుద్ధేస్తుంది.

అలా రామకుమార్, కళ్యాణ్ కుమార్, ప్రసన్న కుమార్, సురేష్, బిందు, (ద్రోణాచలం)

## లేఖావాణి

త్వరలో హీరో కృష్ణ సమాధానాలను ప్రచురించాలని కోరుచున్నాను.

మండల లింగమూర్తి, (కామారెడ్డి)

## వ్యాసాలు

1—9—72 సంచికలో ప్రచురింపబడిన నాగభూషణరావుగారి 'విద్యార్థులు— ఉపాధ్యాయులు' అన్న వ్యాసం చక్కగా వుండి, ఈ కోవకు చెందిన ఉపాధ్యాయులకు 'కనువిప్పు' కల్గించేదిగా వున్నది. వ్యాసకర్త అభినందనీయులు. కొందరు ఉపాధ్యాయులు యీ మధ్య రాజకీయాలలోబడి తమ పవిత్ర విధిని విస్మరించడం, పిల్లలు ఎదుట సహ ఉపాధ్యాయుల్ని విమర్శించడం, పిల్లల ఎదుటే ముష్టి యుద్ధాలకు ఉపాధ్యాయులు దిగడం, సమ్మెలకు పిల్లలను పురికొల్పడం వగైరా గూడా జరుగుతోంది. ఇది 'టీచర్స్ ఆర్ ది పిల్లర్స్ ఆఫ్ ది నేషన్' 'టీచర్స్ అర్ ది బిల్డర్స్ ఆఫ్ ది నేషన్' అన్న యీ స్లోగన్స్‌కి గొడ్డలి పెట్టుగా తయారయి వుపాధ్యాయులకి సంఘంలో తగిన స్థానం లేకుండా చేస్తుందనటంలో అతిశయోక్తి గాదు. మరొక్క విశేషం. కొందరు ఉపాధ్యాయులు శ్రద్ధగా పనిచేసే తమ సహ ఉపాధ్యాయులనే ఎత్తిపొడవటం, వారి కార్యాచరణలలో అడ్డు తగలడం, తాము చేయాల్సిన కనీస పనులను సకాలంలో చెయ్యక అనవసర జాప్యం చేయడం అధికారుల్ని పరోక్షంగా నూటిపోటి మాటలతో విసగించడం వగైరా జరుగుతున్నాయి. ప్రభుత్వము అమలు పరిచిన 'నాన్ డిటెన్షన్స్' పద్ధతి మంచిదయినప్పటికీ, దీన్ని ఆసరాగా తీసుకొని కొన్ని మారుమూల పాఠశాలల్లో క్లాసు పరిక్షలు జరపని ఉపాధ్యాయులున్నారంటే సందేహం లేదు. ఇవన్నీ గమనిస్తున్న విద్యార్థులు యీ కోవకు చెందిన ఉపాధ్యాయుల అడుగుజాడల్లోనే నడుస్తారు. యింక క్రమశిక్షణ ఎక్కడిది??? ఎదుటి ఉపాధ్యాయులపై చులకనాభావాన్ని ప్రదర్శిస్తారు. దీనికి తోడు విద్యార్థుల తల్లిదండ్రులు తమ పిల్లల ఎదుటే ఉపాధ్యాయుని విమర్శించే యీ రోజుల్లో ఉపాధ్యాయునికి 'గౌరవం' ఎక్కడిది ? ? ? ? యీ క్రమశిక్షణా లోపానికి కొంతవరకు బాధ్యులు తల్లిదండ్రులే....

ఎన్నో ఏళ్ళుగా దాచుకున్న యీ విషయాన్ని పై వ్యాసం చదవగానే వ్రాయాల్సి వచ్చింది. సెప్టెంబర్ 5 వ తేదీన దేశమంతటా 'ఉపాధ్యాయుల దినం' జరపబడ బోతున్నది. 'క్రమశిక్షణ గల్గిన విద్యార్థుల చేతులపైనే నవసమాజ నిర్మాణం ఆధారపడి వుంది! విద్యార్థుల్ని సమర్థవంతంగా మలిచే గురుతర బాధ్యత ఉపాధ్యాయుల చేతుల్లో వుంది' అన్న నగ్నసత్యాలని ప్రతి వుపాధ్యాయుడు మరువకూడదు. ఇందుకొరకు అతడు కృషి చెయ్యాలి కూడా.

ఒక ఉపాధ్యాయుడు, (గుత్తి)

*       *       *

బి.ఎ.కె. నాగభూషణరావుగారి 'విద్యార్థులు—ఉపాధ్యాయులు' అనే వ్యాసం చదివాను. చాలా బాగుంది. ఈనాటి కొందరి ఉపాధ్యాయుల తీరు తెన్నులు బాగా పాఠకుల దృష్టికి తేగలిగారు. కొందరు ఉపాధ్యాయులు ఆ స్థితికి దిగజారటానికి గల కారణాలను కూడా తెలిపినట్లయితే బాగుండె. నాకుతెలిసినంత వరకు ప్రధాన కారణాలు 2 కన్పిస్తున్నాయి. (1) పూర్వంలో ఉపాధ్యాయ వృత్తికి ష్టపూర్వకంగా వచ్చేవారు. అంటే ఆనాడు వారు చదివిన చదువుకు మీరి యే పెద్ద ఉద్యోగం వచ్చే అవకాశం ఉన్నా లెక్కచేయక ఉదాత్తమైన ఉపాధ్యాయ వృత్తినే చేపట్టేవారు. అందువలనే వారు ఉపాధ్యాయవృత్తిని నూటికి నూరు పాళ్ళు అర్థంచేసుకొని న్యాయం చేకూర్చేవారు. మరి ఈనాటి పరిస్థితులు దానికి భిన్నంగా ఉన్నాయి. బి. ఏ. వరకు చదివి దానికి ఏ ఉద్యోగం రాకపోతే బి.ఇడి చదవడం, ఎలాగో సిఫార్సులతో ఉద్యోగానికి రావడం జరుగుతుంది. అప్పుడు నిరుద్యోగిగా విసిగి వేసారి అసంతృప్తితో ఉపాధ్యాయవృత్తిలో చేరి, ఉన్నతమైన ఆశయాలు గల ఈ వృత్తికి న్యాయం చేయలేక పోతున్నారు.

(2) ఆస్థిపాస్తులుండి ఉద్యోగం చేసే అవసరం లేకపోయినా, ఏదో చదువుకున్నాం కదా ఉన్న వూళ్లో ఉద్యోగం. ఇటు ఆస్థిపాస్తులు చూసుకోవచ్చు. అటు నెలకు నాలుగు జీతంరాళ్ళు సంపాదించుకోవచ్చు అనే అభిప్రాయంతో చేరేవారు. ఇలాంటి. భావాలతో నైతిక విలువలతో కూడుకొన్న ఉపాధ్యాయ వృత్తిని నిర్వర్తించడం నాగభూషణరావుగారు చూపించిన అవకతవకలకు కారణం కాగలదు.

— వి. ఆర్. (కొత్రపేట, ఈనుమి)

# లక్ష్మి యిష్టములను గురించిన తాజా వార్త.

తను నటించిన ఫిల్ము ప్రారంభపు రాత్రి తారలా వెలుగుతున్న లక్ష్మిని మీ యిష్టములు ఏమిటని అడిగితే. ఆమె నవ్వుతూ యిచ్చిన జవాబులు .

'సితార్ : దాని మధురమైన ధ్వనికి నేను పరవశించిపోతాను సువాసన : తేలికైన అత్తరు వాసనకు నేను ఏదో అయిపోతాను ఆదివారములు : వారం అంతలో నాకు యిష్టమైన రోజు. నెలలో అన్నీ ఆదివారాలైతే ఎంత బాగుండును అనుకొంటాను!'

మీ సౌందర్య రహస్యము అని అడిగితే లక్ష్మి చిఱునవ్వు చిందిస్తూ అన్నారు. 'లక్స్. ఎల్లప్పుడూ'







'నా సౌందర్య రక్షణకు నేను వేరే ఏ సబ్బునూ నమ్మను. శుద్ధమైన, సౌమ్యమైన లక్స్ నేను ఏరి కోరి వాడే సబ్బు'

MDL. 3648

హిందుస్థాన్ లీవర్ వారి ఉత్కృష్టమైన ఉత్పత్తి

## డిటెక్టివ్ నవలలపోటీ

ఈ సంవత్సరం మీరు డిటెక్టివ్ నవలలపోటీ నిర్వహించ బూనడం ముదావహం. అపరాధ పరిశోధక నవలలు చౌకబారు సాహిత్యంగా కొంతమంది భావిస్తున్న సమయంలో, మీరు ఆ సాహిత్యానికి ప్రత్యేక, సముచిత స్థానాన్ని అందించబూనడం హర్షణీయం. అందుకు మిమ్మల్ని అభినందించవలసి వుంది. సాహితీప్రియులు స్వర్గీయ శ్రీ శంభుప్రసాద్‌గారి పత్రిక కావడంవల్ల సాహిత్యసేవలో క్రొత్త పుంతలు తొక్కుతూవుంది పత్రిక.

ఎస్. ప్రణవి, (మద్రాస్)

## సినిమా

25—8—72 ఆంధ్రసచిత్ర వారపత్రిక 34 పేజీలో— 'మట్టిలో మాణిక్యం' ఆగస్టు 5 వ తేదీన టెలివిజన్‌లో 'ప్రసారం అవుతుంది' అని, 'ప్రసారం చేస్తారుట' అని వ్రాయటం అంత సబబుగా లేదు ఈ వార్తను ఆగస్టు 5 కు పూర్వం ప్రచురించి వుండవలసింది

'మట్టిలో మాణిక్యం' చిత్రాన్ని ఆగస్టు 5 వ తేదీన టెలివిజన్‌లో చూపించారు. ఇలాగే ఇంతక్రితం 'ప్రాణ మిత్రులు', 'దేశమంటే మనుషులోయ్', 'చిన్నారి పాపలు' చిత్రాలు కూడా టెలివిజన్‌లో చూపించబడ్డాయి. టెలివిజన్‌లో తెలుగు సినిమా వంతు వచ్చేటప్పటికి కనీసం 3—4 నెలలు పడుతుంది మొన్నమొన్నటి దాకా ప్రతి శనివారం ప్రాంతీయ భాషల చిత్రాలు చూపించబడ్డాయి. (అంటే అరవం, కన్నడం, మళయాళం, బెంగాలీ, మరాఠీ వగైరా) ఇప్పుడు



## ఉత్తరాలు

నెలలో రెండు శనివారాలలో మాత్రమే ప్రాంతీయ భాషల చిత్రాలు టెలివిజన్‌లో చూపిస్తున్నారు.

పి. కామేశ్వరి, ఫరీదాబాద్, (హరియానా)

## గేయాలు

తే 1—9—1972 మన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సోదరులు పూజ్యులు శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి, స్వరాజ్యకవిగారి ప్రకటన చూచుట తటస్థించినది. 'దండాలు దండాలు భారతమాత' అను గేయ రచయిత తానని తెలిపిరి. దానికి నా కృతజ్ఞతాభివందనాలు. నేను చేసిన పొరపాటు మరపుచే చేసినది. కాని స్వయంగా పేరెన్నిక కన్న రచయితగా, నాటక కర్తగా, గేయ కవిగా, స్వాతంత్ర్య సమర యోధునిగా ఆపై ఆధ్యాత్మిక సధాన్వేషిగా నున్న నేను కావలసి దురుద్దేశంతో చేసినదికాదని విన్నవించుకుంటూ, నా తప్పును క్షమించవలసినదిగా శ్రీ వడ్డాదివారిని వేడుకుంటున్నాను. కావలసిన పని నెరవేరినది. నాకు కావలసిన గేయములన్నియు నాకు చేరినవి. వాటి ప్రయోజనము జవాహర్ భారతి, కావలి విద్యార్థులచే పాడింపబడి వాటి ఔన్నత్యం ఈ యువతరంవారికి తెలియ జేయుడమే. ఆ పని ఈ ఏడాది పొడుగునా సాగుతుంది. 'ఘోరము' అను పదము వారు వాడుట నా మనస్సును నొప్పించినది. వారి పేరును తిరిగి ఈ విధముగా ఆంధ్రప్రజానీకానికి తెలియజేయుటకు నిమిత్తమాత్రంగా నా సద్గురువులు ఉపయోగించిరి. అందులకు మా గురుద్వయులకు దండప్రణామాలు.

మోహనానంద శివానంద బాబా, ఆచార్య మాడభూషి వెంకటాచార్య, (క్యాంపు సికింద్రాబాద్)

1—9—72 శ్రీ వడ్డాది సీతారామాంజనేయులు కవి దండాలు దండాలు భారత మాత తల్లికి. శ్రీ సీతారామంజనేయులు కవిగార్ని కీ. శే. పూడిపెద్ది కాశీ విశ్వనాథంగారు కలిసి ఆస్వరాజ్య గీతామృతం వ్రాసేరని నాతలంపు— ఆపుస్తకం అట్టపై ఆట్లనే ఉన్నట్లు నాజ్ఞాపకం.

పదం— కీ. శే. పూడిపెద్ది కాశీవిశ్వనాథంగారు (మా పెద్దతల్లి కొడుకె) వ్రాసినట్లు.

పద్యాలు— శ్రీ వడ్డాది సీతారామాంజనేయులు గారు వ్రాసినట్లు—మా అన్నగారు (విశ్వనాథంనాతో అన్నారు.) మరొక నిదర్శనం—ఆకాశవాణి (విజయవాడ—హైదరాబాదు) ఒకటి —రెండు స్వాతంత్ర దిన తేదీలన ఆపాట— ఒకటే రెండు చరణములు ప్రసారం చేస్తూ, రచయిత విశ్వనాథంగారని చెప్పుట నేను విన్నాను. వారిరువురు పురాణం సూర్యనారాయణ తీర్థగారి ప్రియశిష్యులని అందులో పేర్కొన్నారు. శ్రీ సీతారామాంజనేయులుగారు సవరణ చేస్తారనే నాతలంపు.

—ఆరాధ్యుల నరసింహమూర్తి, (చెన్నూరు)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938—1972)

శుక్రవారం 6 10-72

శ్రీవిరోధినామసం॥ ఆశ్వయుజమాసం॥ బ॥ చతుర్థ

సంపుటము 60 సంచిక 4

స్థాపితము 1908

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1

విడిప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక


కుడివైపుకు
ఎడమవైపుకు
నెహ్రూ స్టడీ ఫోరమ్
సోషలిస్టు ఫోరమ్
కొత్తకాంగ్రెసువిధానాలు
అమీన్
ఆసియన్లు
తిరుగుబాటుదార్లు
ఒరిస్సా
ప. బెంగాల్
అస్సాం
బీహార్
మైసూర్
మహా
ఆంధ్రప్రదేశ్
రాజస్థాన్
రాష్ట్ర కాంగ్రెసువర్గాల్లో
పనివారు
కనీసపుబోనస్
8.33%
మనదరిద్రాన్ని అది తీర్చలేదు
లక్షల సంఖ్యలోని నిరుద్యోగులు

# హైదరాబాద్ నోట్ బుక్

## తిరుమల రామచంద్ర

### నౌబత్ పహాడ్‌పై నవమందిరం

ప్రపంచంలో మంచిచెడుగుల దాగుడుమూతలు తప్పవేమో! ఒక మంచి తలపెడితే, ఏకొంచెం చెడుగ్గైనా దానిని వెంటనంటే ఉంటుంది. శ్రీశైలం జలవిద్యుత్ప్రణాళిక తలపెడితే, ప్రాచీనతర మందిరాలలో ఒకట్యైన రూపసంగమేశ్వరాలయం జలాశయంలో మునిగిపోతున్నది. దీనిని మరల ఎక్కడ ప్రతిష్ఠించుదామా— అనే ఆలోచన కలిగినప్పుడు రాజధానిలోని నౌబత్‌పహాడ్ జ్ఞాపకం వచ్చింది శ్రీ బిర్లా కంపెనీవారికి. దీనిని సోమశిలగ్రామంనుంచి మూలమట్టంతో నౌబత్‌పహాడ్‌కు తరలిస్తారు. నౌబత్‌పహాడ్‌కూడా చారిత్రకమ్మైందే. ఔరంగజేబు అబుల్‌హసన్ తానీషాపై దండెత్తివచ్చి నప్పుడు ఈ కొండ పక్కని లోయలో దండు విడిశాడు. అదే గెలుపు తర్వాత ఫతేమ్మైదాన్ అయింది. ఈ కొండమీదినుంచి శత్రువులకు తమరాక చూపడానికి నగారాలూ, నౌబత్తులూ వాయించడంవల్ల ఈ కొండకు ఆ పేరు వచ్చిందట. అప్పుడెప్పుడో అందమ్మైనగుమ్మటంతో కట్టిన మండపాన్ని సెప్టెంబర్ 7వ తేదీన తొలగించినప్పుడు చరిత్రాభిమానుల మనస్సు కొంచెం చివుక్కుమన్నది. కాని, దానిస్థానంలో రూపసంగమేశ్వరాలయం నెలకొని నగరానికి మంత శోభ కలిగిస్తుందనే ఆశ్వాసనమూ వెంటనే కలిగింది. మరొకచోట ఈ మందిరం నెలకొల్పరాదా — అన్నవారూ లేకపోలేదు.

### ప్రథమభారత నాటకకర్త

ఎక్కడ చూచినా, విన్నా కాళిదాస జయంతులే తప్ప, భారతదేశంలో ఆది నాటకకర్త అయిన భాసుని తలచేవారు లేకపోతున్నారు. ఈ లోటు శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి, శ్రీ సి. నారాయణరెడ్డి నాయకత్వాన నడిచే శ్రీ నవ్య కళామండలి (కాచిగూడ) కృషితో ఇటీవల తీరింది: శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతన సెప్టెంబర్ 4వ తేదీన సాహిత్య అకాడెమీ హాలులో భాసోత్సవం జరిగింది. భాసుడు గ్రీకుచరిత్రలోని ట్రోజన్‌హార్స్ వంటి దానిని ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో మాయ ఏనుగుగా ప్రవేశపెట్టడం గొప్ప టెక్నిక్ అని కప్పగంతుల లక్ష్మణశాస్త్రి. దైనందిన విషయాలు అందంగా చిత్రించినవాడు భాసుడేనని శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి, నాటకకర్తగా కాళిదాసును మించినవాడు భాసుడని డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, భాసుడు క్రీస్తుపూర్వం 4వ శతాబ్దివాడయి వుంటాడని డాక్టర్ శ్రీ రామచంద్రుడు, భరతునికి ఈవలివాడయి వుంటాడని డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు, ప్రాచీన సంస్కృత నాటకాలలో అభినేయమయినవి భాస నాటకాలేనని శ్రీ పాటూరి శ్రీ రామశాస్త్రి మొదలయినవారు ప్రసంగిస్తున్నంతసేపు కాలం భాసుడే అన్నట్టు 'చక్రార పంక్తి'లాగ ఎంత గడిచిపోయిందో సహృదయులకు తెలియలేదు.

### శ్రీ పి. టి. రెడ్డి సూచన

'సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం' అన్నారు గాని, 'సంగీత మపి 'పెయింటింగు' అని సవరిస్తే బాగుంటుందనే భావం శ్రీ పాకాల తిరుమల్ రెడ్డిని చూస్తే ఎవరికైనా బలపడుతుంది. ఎప్పుడు ఆయనను చూడండి, ఏదో శిల్పం గండరిస్తూనో, ఏదోచిత్రం గీచుతోనో, ఏదో ఫలకం చెక్కుతూనో, ఏదో అద్దకం గుద్దుతూనో దర్శనమిస్తారు. ఇల్లొక చిత్రశిల్ప నికేతనం. ఆయన మరొక భాగ్యం అటు గహనతమ పరిశోధనలోను, ఇటు ఆధునిక సాహిత్య సర్జనంలోను యశస్విని డాక్టర్ యశోదా రెడ్డి ఇల్లాలు. తిరుమల్‌రెడ్డి ఎన్నిసార్లు విదేశాలకు వెళ్లారో, ఎప్పుడు వెళ్తారో, ఎప్పుడు తిరిగివస్తారో అంతా విచిత్రం. పటాటోపం ఏమీ ఉండదు. ఇటీవలే యుగోస్లేవియాకు వెళ్లి వచ్చారు, సాంస్కృతిక ప్రతినిధివర్గం నాయకులుగా. అక్కడివారికీ మన సమస్యల వంటివే ఉన్నాయన్నారు. కాని వారు జాతీయకళను రూపొందించుకొంటున్నారన్నారు. మన సంగతి ఏమిటి ?— అన్నాను. 'మన ప్రాచీన కళాసంపద గొప్పదే.- కాని మొగల్‌ల కాలంనుంచి



జాతీయ కళాభావనా స్రవంతి విచ్ఛిన్న మయింది. దానిని మరల రూపొందించు కొనడానికి నా ఒక్కని ప్రయత్నం చాలదు. ఆ పాతబాటని అనుకరించండి. కొత్త భావాలు గ్రహించండి; సమసామయికత లేనిదే ఏ కళా నిలువదు. ఆధునిక కళే నిజానికి భావవ్యక్తీకరణకు ఏకైక సాధనం. దానితో మానసిక పరిణతి, నిపుణత, భూత వర్తమాన అనుభవాల సమాహారం—అన్నీ కరిగి సమ్మైక్యమై కాలక్రమేణ జాతీయ కళా సంప్రదాయం రూపొందుతుంది. దర్శన, భావన, అనుభవాల సమామ్నాయమే అది' అన్నారు ఆయన.

ప్రకృతి రమణీయమయిన కరీంనగర్ జిల్లా అన్నారంలో జననం; బొంబాయి జె. జె. లలిత కళాశాలలో అభ్యసనం, 1942 లోనే అక్కడే ఫెలోషిప్ పదవి, శీలా మహల్ స్టూడియోస్‌లోను, లాహోర్‌లోని రంజిత్ మూవీస్‌లోను కళాదర్శకత్వం శ్రీ తిరుమల్ రెడ్డి ప్రతిభను బహుముఖంచేసి, నేడు భారతదేశంలో 'ఫాదర్ ఆఫ్ మాడర్న్ ఆర్ట్' అనే బిరుదం ప్రసాదించాయి. యింతయినా, ఆయన 'విదేశీ అనుకరణ, అమెరికా అనుకరణ వద్దు వద్దు!' అంటారు.

**మాకూ వోటు హక్కు!**

'ప్రాప్తేతు షోడశే వర్షే పుత్రం మిత్రవదాచరేత్' అని తండ్రులకు హితవు చెప్పారు ఎవరో! మా అష్టాదశ వర్షాలకు వోటింగు హక్కు కావాలని యువకులు అడిగితే తప్పేముంది? నేటి యువకులు నాటి మట్టిముద్దలు, వర ప్రత్యయనేయ బుద్ధులు కారు. ఇటీవల వారు ముఖ్యమంత్రి వద్దకు రాయబారం వెళ్లారు శాసనమండలి భవనంలో. వోటు హక్కు కావాలన్నారు. వారికి నాయకులు శ్రీ ఎ. పుల్లారెడ్డి, శ్రీ వి. రామనరసింహారావు. వీరు విద్యార్థి నాయకులు.

**ఈశ్వరఅల్లా తెరోనామ్!**

స్నేహా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ యూత్ ఆఫేర్స్—మత సామరస్యానికి, భావసమైక్యానికి చేస్తున్న కృషికి మరొక నిదర్శనం ఇటీవల—సెప్టెంబర్ 7 వ తేదీన నారాయణగూడాలోని న్యూ సైన్స్ కాలేజిలో జరిగిన సమావేశం. మత విషయంలో ఆసక్తి, పరిశ్రమ ఎంతగా యువకులలో ఉన్నాయో, వక్తలూ శ్రోతలూ నిరూపించారు. యువకులు అన్ని మతాలను అధ్యయనం చేసి, సర్వమత సమ్మతమైన విధానాన్ని రూపొందించుకోవాలన్నది ప్రసంగాల సారాంశం. వీరంతా విద్యార్థులే. శ్రీ ఎం. ఎ. నహీద్ ఇస్లాంను గురించి, శ్రీ ఎం. హరగోపాల్‌రావ్ భారత ధర్మాన్ని గురించి, శ్రీ ఎలియాస్ జాత్ క్రైస్తవాన్ని గురించి అనర్గళంగా ప్రసంగించారు.

**రాష్ట్రపతి వద్దకు రాయబారాలు**

భారతదేశానికి ద్వితీయ రాజధాని హైదరాబాద్‌లో రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి మకాం పెట్టినప్పటినుంచి వివిధ సంఘాలు, పలువురు నాయకులు రాయబారం వెళ్ళడం ఎడతెరపిలేకుండా జరుగుతూనే ఉంది. కాని, సెప్టెంబర్ 8 వ తేదీ రాయబారం విశిష్టమయినదంటే తప్పు లేదు. ఈ రాయబారం "హూమానిటేరియన్స్ సంఘం" వారిది. దేశంనుండి దారిద్ర్యాన్ని తొలగించాలని ఈ సంఘంవారు కోరారు. అలాగే దళితజాతులవారూను.

**వినాయకుని వీరవిహారం**

నాగరికత రాజ్యాల పతనాభ్యుత్థానాల లాగే దేవతల పతనాభ్యుత్థానాలూ ఉంటాయనుకుంటాను. లేకపోతే వేదకాలపు దేవతలు నేడు వినాయకుని పంక్తి పంటల దేవునికి, దారియిచ్చి పక్కకు తప్పుకోడం సంభవమా? వేదమంత్రాలను తనకు అన్వయించుకొన్న ఈ మధ్యకాలపు దేవుడు జంటనగరాలపై వివిధ రూపాలతో దాడి చేశాడు. ఎటు చూచినా, ఏ చౌరస్తాలో చూచినా వేనవేలు వినాయక విగ్రహాలే! అంతటి విశాలవీధులూ విగ్రహవిక్రేతల బృందాలతో ఇరుకైపోయాయి. ●



ఆంధ్ర ప్రదేశ్ మైనర్ ఇరిగేషన్ మంత్రి శ్రీ కిలారి గోపాలనాయుడు గారి కుమార్తె చి. సౌ. గజలక్ష్మికి శ్రీ ఎస్. వి. రామచంద్రరావు గారి కుమారుడు చి. ఎం. ఆర్. రాధాకృష్ణకు మద్రాసులోని అబ్బట్స్ బరీలో సెప్టెంబరు 14న వైభవంగా వివాహం జరిగింది.

వివాహానికి వచ్చి వధూవరులని ఆశీర్వదించిన వారిలో ముఖ్యులు: శ్రీయుతులు పి. వి. నరసింహారావు ముఖ్యమంత్రి, బి. వి. సుబ్బారెడ్డి (ఉప ముఖ్యమంత్రి.) మంత్రులు జె. రాజారావ్, వి. కృష్ణమూర్తి నాయుడు, బి. జయప్రద, పి. నరసారెడ్డి, ఎం. మాణిక్యరావు, ఉకలాపు లక్ష్మణదాసు, ఎం.వి. కృష్ణారావు, కాకాని వెంకట రత్నం, సాగి సూర్యనారాయణ రాజు, టి. హయగ్రీవాచారి, కె. ప్రభాకరరెడ్డి, భాట్టం శ్రీరామమూర్తి, తమిళ నాడు విద్యాశాఖ మంత్రి శ్రీ నెడుంజెళియన్, కె. కామరాజనాడార్, భక్తవత్సలం.

సినిమా నటులు శ్రీయుతులు ఎన్. టి. రామారావు, ఏ. నాగేశ్వరరావు, ఎం. జి. రామచంద్రన్, ఎస్. వి. రంగారావు, మొదలైన వారు. నిర్మాత, సి. పుల్లయ్య, డి. మధుసూధనరావు, డి. రామానాయుడు, బి. నాగిరెడ్డి, డి. వి. ఎస్. రాజు, మొ. దర్శకులు రాజేంద్రప్రసాద్ కె.ఎస్. ప్రకాశరావు. మొ.

ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు వధూవరులని ఆశీర్వదిస్తున్న దృశ్యాన్ని ఫోటోలో చూడవచ్చు.

# అనామధేయుడి ఆత్మకథ

## సీరియస్‌లెస్ హాస్యరచన — ఆర్వీయ

## 10

ఆ రోజు ఆదివారం. నేను పక్క గదిలో కూర్చొని ఏదో రాసుకుంటు న్నాను. వద్దన్నా వీళ్ళ మాటలు నా చెవుల్ని దొలిచేస్తున్నాయి. అక్కడితో నా రాత ఆగింది. మరి చేసేదేమీలేక చెవులప్ప గించి, కళ్ళు మూసుకొని కూర్చున్నాను.

'కోవెల్లో హరికథా కాలక్షేపానికి వస్తు న్నారా ?' అని ఒక బొమ్మ.

'ఏం హరికథ ? ఒక పిట్ట కథా లేదూ, ఒక పిపీక కథా లేదూ ! ఎంత సేపూ ఒకటే రొడ్డ కొట్టు!' అని ఒక భామ.

'అయినా ఈ కాలంలో కూడా ఇంకా హరికథలేమిటి ? హరికథలూ, తోలుబొమ్మ లాటలూనూ...మన వూరి వాళ్ళకి మతి పోయింది. శుభ్రంగా ఒక మాంచి బుర్ర కథ పెట్టించకూడదూ ?' అని ఓ నాగరికు రాలు.

'బుర్రకథకీ, హరికథకీ తేడా ఏమీ లేదమ్మా. పురాణచరిత్ర అయితే హరికథ. నేటి చరిత్ర అయితే బుర్రకథ. ఎడం చెయ్యి—పుర్రచెయ్యి...అంతే !' అని ఒక సర్వజ్ఞురాలు.

'ఎంతసేపూ పురాణాలూ, హరికథలూ, వంటా పెట్టూ తప్ప ఇంకో మాట లేదా ఏమిటి ?' అని ఒక మాటకారి.

'పాపం! ఓవిడో !—అల్లా శంకర్రావుని ఉద్యోగంలోంచి పాపం, దించేశారుట' అని ఒకావిడ.

'నువ్వన్నీ తెలిసినట్టు మాట్లాడతావు. భీమారావుని దించేశారుట!' ఇంకో ఆవిడ.

'కాదు తల్లీ ! నీకు తెలియకపోతే వూరుకో. రామారావుకి ఈ ఉద్యోగం ఇవ్వాలని ఆ ఎత్తుట. అంచేత ఈ శంకర రావు చవగ్గా దొరికేడు దించెయ్యడానికి!' అని మరో ఆవిడ.

'లేదమ్మా! శంకర్రావు వుద్యోగంలో ఏదో లోటు వచ్చిందట. లేకపోతే అమాం తంగా దించెయ్యగలరా?' అని మరో ఆవిడ.

'అది కాదూ ! — అతగాడు 'బియ్యం' పాసు కాలేదుట. అంచేత దించేశారుటా !' అని మరో తెలివైన ఆవిడ.

బియ్యం ఏమిటమ్మోయ్?' ఒక ప్రుచ్ఛకు రాలు.

'బియ్యం ఏమిటి? నా తలకాయ. 'బియ్యే' అని కాబోలు ఆవిడ ఉద్దేశ్యం' అని ఒక ఆంగ్లేయ విద్వాంసురాలు.

'చాలా మంచివాడుట. అతనూ మా ఆయనా కలిసి నాటకాలుఆడుతూవుంటారు' అని ఒక స్త్రీరత్నం.

'ఆయన మాటకేంగాని మీ ఆయన బాగా నాటకం ఆడతారని మా ఆయన అన్నారు.' రెండో లలనామణి.

'అందరూ అలాగే అనుకుంటూ వుంటారు. ఊరంతా అదేమాట. మీ ఆయన ఎప్పుడన్నారు?' మొదటావిడ.

'ఆ—మొన్నే— ఆవేళ పదిరూపాయల నోటు మీ ఆయన తన జేబులోపెట్టుకుని ఒక రెండురూపాయిలు మా ఆయన మీా అయిన్ని అప్పు అడిగితే, లేవుగాక లేవన్నా



దుటి. అప్పుడే ఇంటికొచ్చి అన్నారు· "... ఆయన నాటకం బాగా ఆడతాడే' అని.' అని రెండో ఆవిడ,

'అందుకే కాబోలు మీ ఆయన బాగా పాట పాడతారని మా ఆయన అన్నారు' మొదటి స్త్రీరత్నం.

'దానికీ దీనికీ ఏమిటి సం బ ం ధ ం? ఇంతకీ ఏం పాట?' రెండో లలనామణి.

'లేదో లేదో అని' మొదటావిడ.

'బాగుందమ్మా ఈ దెబ్బలాట?' అని ఒక శాంతిప్రియ.

ఇదంతా ఒక రేడియో నాటికలా నాకు విన్పిస్తూంది.

అంతలో 'చెళ్ళ'మని చప్పుడూ, 'అమ్మో' అని పెడబొబ్బలూ విన్పించేయి. ఈ హఠాత్సన్నివేశానికి నేను తృళ్ళి పడ్డాను.

'తరువాత తెలిసింది అసలు విషయం. అమ్మలక్కలు కబుర్లలో మునిగిపోయిన సమయం కనిపెట్టి, మన 'డింభకాసురుడు' ఏం చేస్తున్నాడంటే — ఒకావిడ జడ వుండుండి లాగడం, మరో ఆవిడ చెవిలో చీపురుపుల్ల దూర్చడం, ఇంకో ఆవిడ నెత్తిమీద మొట్టికాయ పెట్టడం, వగైరా అభినవ శ్రీకృష్ణలీలలు అమాంతంగా జరిపేస్తున్నాడట! ఆ 'యశోదమ్మ'కి— అంటే ఇంటావిడకి— ఈ సంగతి ఏమీ తెలీదు. లేకపోతే చూస్తూ వూరుకుందో మనకి తెలీదు.

అమ్మలక్కల స్థితి వర్ణనాతీతంగా వుంది. ఈ సన్నివేశాన్ని చూసి, మా ఆవిడకి— వీడు మా పిల్లాడు కానందుకు ఆనందం, వాడి చేష్టలికి బీభత్సం, అమ్మలక్కల అగచాట్లకి కరుణ హాస్యరస మిశ్రభావోదయం; వాడిని చూస్తే జుగుప్స కలిగింది. ఈ నానా నవరసాలూ మూర్తీభవించి, మా ఆవిడ ముఖం వివరింపరాని అద్భుతావస్థలో పడిపోయిందట. మిగతా అమ్మలక్కలు సరేసరి! విపరీత విపత్కరాయోమయావస్థలో ఉండిపోయేరట.

అంతలోనే ఆ ఛెళ్ళమన్న శబ్దం, అమ్మో అన్న పెడబొబ్బ వినవచ్చేయుట. పాపం, ఆ కుర్రాడి చెంప ఎవరు చెళ్ళమనిపించేరో అప్పటికీ ఇప్పటికీ తెలేదు. కాని, ఇంటావిడ— ఎవరో తెలీకపోవడం చేత— అమ్మలక్కలనందర్నీ, మా ఆవిణ్ణీ కూడా కలిపి దుమ్మెత్తి పారబోసింది. రోజూ అడపా దడపా మమ్మల్ని ఏదో ఒకటి అంటూ వచ్చింది. మిగిలిన అమ్మలక్కలంతా మరి ఆ యింటి మొఖాన్ని

చూడలేదు. మేమెక్కడికి పోతాం? కనుక్క, రోజూ ఎలకమీదా పిల్లిమీదా పెట్టి మమ్మల్ని అంటున్న మాటలు కర్ణపుటాల్లో జొరబడి మా మనస్సుల్ని కకావికలు చేస్తూండేవి. మరి ఆ యింట్లో ఒక్కక్షణం వుండలేకపోయేం. అప్పుడే నాకో బుద్ధి పుట్టింది: 'వింటే భారతమే వినాలి, తింటే గారెలే తినాలి. ఉంటే స్వంత యింట్లోనే వుండాలి.'

నాకు బుర్రలో బుద్ధి పుట్టనే కూడదు. పుట్టిందా? అది శవో రవో తేలిన దాకా వూరుకునే ఘటాన్ని కాదని మీకీపాటికి తెలిసే వుంటుంది.

మా ఆవిడ మెళ్లో పుస్తె పూసా అమ్మి, అగ్రహారంలో వున్న జిరాయితి చెక్కా ముక్కా అమ్మి, అక్కడికీ చాలకపోతే 'భూమి తనఖా బ్యాంక్'లో అప్పుతీసి చిన్న డాబా ఇల్లు కొన్నాను.

అద్దె కొంపకి ఒక గ్రాండ్ గుడ్‌బై కొట్టి, స్వంతయింట్లో ఓ శుభముహూర్తాన గృహప్రవేశం చేశాం.

### కావ్యేషు నాటకం రమ్యం

మానవుడు వాస గ్రాసవస్త్రాలతో తృప్తి పడలేడు. అలా సంతుష్టిపడిననాడు నరుడికీ, వానరుడికీ—పశువుకీ, ద్విపాదపశువుకీ ఈ షణ్మాత్రమూ తేడా వుండబోదు. అదీగాక మానవుడు సంఘజీవి. సంఘాన్ని విడిచిన మానవుడు నీటిఒడ్డున పడ్డ చేపతో సమానం. అందుకే బౌద్ధులు 'సంఘం శరణం గచ్ఛామి' అన్నారు. అన్నిజాతులూ అన్నిమతాలూ సంఘశ్రేయస్సుని పాటించమనే ఆదేశిస్తాయి. ఏదోవిధంగా డబ్బు సంపాదించి, తానింత తిని, పెళ్ళాంబిడ్డలకి ఇంతపెట్టి సంసార ఝుంఝూటంతో మునగానాం తేలానాం అంటూ 'ధన్యోస్మి' అనుకోవడంతో జీవితం సమగ్రం కానేరదు—అన్నారు పెద్దలు! అందుచేత జీవితాన్ని కళామయంగా చేసుకొని, ఒకర్ని తరింపచేసి, తాను తరించడం ఉత్తమం!!

ఎందుకంటే ఈ గానుగెద్దు జీవితం కంటే వేరే కళాత్మకమైన జీవితం ఒకటి వుందని గ్రహించాలి. అది లేకపోతే మానవ జీవితానికి మానసికంగా చైతన్యం, వికాసం, ఆనందం, పరిపూర్ణత కలగదు. దేహానికి మనస్సుకీ అవినాభావ సంబంధం వుంది. అంచేత దేహం కూడా 'మనస్సుతోబాటు నీరసమై పోవచ్చు. అదీకాక, కళలవల్ల

# అనామధేయుడి ...

విశాలభావం కలిగి, సంస్కారం సంభవించి, స్వార్థబుద్ధి నశించి, సహనబుద్ధి అలవడి జీవితంలోని ఒడిదుడుకుల్ని మందహాసంతో అధిగమించే స్థైర్యం, కష్టనష్టాల్ని, సంతోషంతో స్వీకరించగలిగే వైరాగ్యభావం అలవడుతాయి. 'జీవితం' అన్నది 'జగన్నాటక రంగం'లో ఒక 'రంగం' అని, అందులో సుఖదుఃఖాలు కేవలం 'ఆత్మ' అనే పాత్రదే కాని—'జీవుడు' అనే పాత్రధారిది కాదనీ, మనమంతా జగన్నాటక పాత్రధారులం మాత్రమే కనుక సుఖదుఃఖాలు మనకి అంటజాలవనీ—అన్న, ఒకానొక ఉదాత్తభావంతో పావన భావనతో ఆత్మశాంతి కలిగించుకోవచ్చు. అప్పుడు జీవితం కంటక భూయిష్టమైన కఠోరమార్గంకాక—రసవంతమైక కావ్యఖండ బిందువవుతుంది. మనలోవున్న పశుత్వం నశించి, మానవత్వమూ క్రమేణా దేవత్వసిద్ధి కలుగుతుంది. జీవితం పునీతమై తీరుతుంది.

'అయితే ఈ సంగతులు ఎవరికి తెలియవయ్యా? కొత్తగా చెప్పుకొస్తున్నావేమిటి?' అని కోప్పడగలరు. ఈ సంగతులు మీకెవరికీ కొత్త కాకపోవచ్చు. నాతోటి ఆఫీసు గుమాస్తాలకి ఇవి సరికొత్త అని చెప్పక తప్పదు. ఇవి నచ్చజెప్పి, వాళ్ళని దారికి తీసుకొనిరావడానికి నా తల ప్రాణం తోకకి వచ్చిందంటే నమ్మండి.

ఒకడంటాడు :

'జీతము జూడ గోత, ఇలుసేరగ బిల్లల
మోత, ఇంక వి
ఖ్యాతికి నీళ్ళ వ్రాత, ఇరకాటము
కొంపలు చాల రోత ఆ
రాతిరియున్ బవళ్ళనక రాయుటయే
తలవ్రాత, వస్తువి
క్రేతల షాపునం దరువులే గద రంపపు
గోత—చావనా?'

'శ్లేషకవిత్వం దంచేశావయ్యా' అన్నాను.

'శ్లేషకవిత్వం ఏమిటి?' అన్నాడు బిక్కమొహంవేసి.

'ఆఖరి పాదంలో 'షాపునం దరువులే గద' అన్నావు. నీ ఉద్దేశం ఏమిటి? 'షాపునందు అరువులే గద' అనా, లేకపోతే 'షాపునన్ దరువులే గద!' అనా?' అనడిగేను.

'రెండూ!' అన్నాడు మావాడు.

'అదే శ్లేషకవిత్వం' అన్నాను నేను.

సరే అని మరో పెద్దమనిషి దగ్గరికి వెళ్లేను. ఈయన సంగతి సరేసరి!

ఈయన అంటాడు గదా :

'ఆఫీసరుడి చేత ఆఫీసులో తిట్లు
ఇంటి యావిడ చేత ఇన్ని తిట్లు
పక్కింటివాళ్లచే పలురకంబుల తిట్లు
చిన్న పెద్దల చేత కొన్ని తిట్లు
అప్పుల వాళ్ళచే అతిఘోరవౌ తిట్లు
చుట్టాలచే కొన్ని గట్టి తిట్లు
తల్లిదండ్రుల చేత వల్లమాలిన తిట్లు
అత్త మామలచేత అన్ని తిట్లు
తిట్లు అలవాట్లు గాగ, చీవాట్లు వేడి
వేడి పెసరట్లుగా అగచాట్లతోడి—వీడి
చిత్తమే రీతిని తతంబు జేరనేర్చు?
వినుత గుణశీల మాటలు వేయునేల?'

'ఓహో, ఏమి క్రమాలంకారం?' అన్నాను.

'అలంకారం యేమిటి?' అని బంగారు గుండీలూ, స్టెయిన్‌లెస్ స్టీలు రిస్ట్‌వాచీ, జేబులో పార్కరుపెన్నూ చూసుకుంటున్నాడు.

'నీ ఒంటిమీద అలంకారం కాదయ్యా! పద్యంలో క్రమాలంకారం పకడ్బందీగా పడింది. మొదట 'ఆఫీసరుడి చేత.' దాని మీద 'పక్కింటి వాళ్లచే.' దీనికి శిఖరాయమానం 'అప్పులవాళ్ళ చేత'. దానిని మించినది అప్పులకి కారకులైన 'చుట్టాలచే' తిట్లు. ఇదంతా చాలదు అన్నట్టు—పతాక ఘట్టం 'తల్లిదండ్రుల చేతా, అత్తమామల చేతా'నున్నూ! ఒకదాన్ని 'మించింది ఇంకొకటి. ఇదే క్రమాలంకారం' అన్నాను.

'మన ఆఫీసువాళ్ళందరం ఒక క్లబ్ ఏర్పాటు చేసుకుని లలితకళల్ని ఉద్ధరిద్దాం' అంటే వొచ్చిన అశేష అమూల్యాభిప్రాయాల్లో మచ్చుకివి రెండు వజ్రపు తునకలు. మిగతా వాటిని స్థలాభావం చేత విడిచిపెట్టేను.

వాళ్ళందరినీ విడి విడిగా గుంపులు గుంపులుగా కలుసుకొని నచ్చచెప్పి ఒక సంఘాన్ని స్థాపించడానికి బ్రహ్మాండమైన ప్రయత్న సంరంభం జరిపించేను. తత్పర్యవసానమే 'కళా కండూతి మండలి' స్థాపన. కళా కండూతి నివారణకి ఇంతకన్నా పరమౌషధం, సిద్ధాంజనం ఇంకోటి నభూతో నభవిష్యతి! మా మండలి ప్రప్రథమ సమావేశం గొప్ప అట్టహాసంగా జరిగిందంటే న్యూనోక్తి. మా మండలిలో

పంచాంగాలు వున్నాయి. పంచశీలము లున్నాయి. త్రికరణాలూ వున్నాయి.

పంచ—అంగాలు ఏవంటే ?

1. చతుర్ముఖ పారాయణ కళ.

2. జాతీయ అంతర్జాతీయ కేళీకళ.

3. దైనిక, వారైక, పాక్షిక, మాసిక పత్రికా పఠన కళ.

4. నాటక కళ.

5. సాహిత్య కళ.

పంచశీలములు ఏవంటే ?

1. క్లబ్బుకి రాగానే వుల్లాసం నటించాలి.

2. సభ్యులతో అసభ్య వాక్యాలు గట్టిగా అనకూడదు.

3. ఇంటిలోనీ, ఆఫీసులోనీ పడిన చికాకులు క్లబ్బు ప్రెసిడెంటు మీదా, సెక్రటరీ మీదా ఎంత మాత్రం చూపించరాదు.

4. క్లబ్బుని క్లబ్బులాగే చూడాలి. కాని ఇల్లు లాగ చూడరాదు. అంటే ఇరవై నాలుగు గంటలూ క్లబ్బులో కాపరం చెయ్యరాదు.

5. క్లబ్బుకి మొట్ట మొదట వచ్చిన వాళ్ళు గది శుభ్రంగా తుడవాలి. ఆఖరిదాకా వుండి వెళ్ళినవాళ్ళు దీపాలు ఆర్పి వెళ్ళాలి.

త్రికరణములు ఏవంటే :

1. నెల చందా పదిసార్లు కంటె ఎక్కువ తిప్పకూడదు. అలా తిప్పడం తప్పనిసరి అయినప్పుడు, ఎప్పటికైనా చందా యిచ్చి చేతులు కడుక్కోవాలేగాని, ఎంతమాత్రమూ ఎగవెయ్యరాదు.

2. నెలకి 29రోజుల కంటె ఎక్కువగా గైరుహాజరు కాకూడదు. అలా అయిన పక్షంలో వారి సభ్యత్వం రద్దు చేయబడుతుంది. నెల చందా సవ్యంగా ఇచ్చినవారి పట్ల యిది వర్తించదు.

3. ప్రతి సభ్యుడూ క్లబ్బు ఆవరణలో ఏదో ఒక—పనికి వచ్చినదో, పనికి రానిదో— వ్యాసంగంలో పాల్గొని తీరాలి. ఏ వ్యాసంగంలోనూ కుతూహలం లేనివారు కబుర్లైనా చెప్పడం నేర్చుకోవాలి.

—ఈ విధంగా 'కళాకండూతి మండలి' నిబంధనావళిని నలుగురమూ కలిసి రూపొందించేం. అప్పుడే అయిందా? ఇల్లు అలగ్గానే పండుగైందా ఏం? క్లబ్బు అనగానే మాటలా? దేశాన్ని — ఆ మాట కొస్తే ప్రపంచాన్నంతా—ఏకత్రాటి మీద నడిపించవొచ్చు. కాని, క్లబ్బులో వున్న నలుగురినీ ఒక్కమాట మీద వుంచడం కష్టం. అంతేకాదు, కష్టాతికష్టం!

(ఇంకా వుంది)

# గూఢచారవృత్తి: ఏజంట్లు - వీరులు
## కల్పనా కథలను వశపరచుకున్న విషయము
### — డేవిడ్ రీన్

గూఢచార వృత్తిలో గల చిక్కులు, మరుదు గొలిపే సంగతులు తెలిపే ఐదు పుస్తకాలను ఎఫ్. డబ్ల్యూ. ఎఫ్. ప్రతినిధి 'డేవిడ్ రీన్' ఈ విధంగా విమర్శించారు.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత, గూఢచార విషయాల్ని గురించి ప్రజలు చదవకుండా వుండలేక పోతున్నారు. 'ఇయన్ ఫ్లెమింగ్' మున్నగు రచయితల పరిశోధాత్మక నవలలు దేశాంతరపు కుట్రల గురించి తెలుపుతూ, ఈ విప్లవకాలంలో కథలకంటె, వాస్తవంగా జరిగినవి చాలా నాటకీయంగాను, సంశ్లిష్టము గాను ఉన్నాయని స్పష్టంగా చెప్తున్నాయి. ఇటీవల లండన్‌లో దేశాంతరపు కుట్రలను గురించి ప్రచురింపబడిన ఐదు రచనలు 'యదార్థాలు కట్టుకథలకంటె వింతగా ఉంటాయి' అని మళ్లీ మనకు తెల్పుతున్నాయి. ఇటువంటి విషయాలు తెలియజేసే పుస్తకాలు ముందెప్పుడూ వెలువడలేదు.

వీటిల్లో మొదటిది లేడిస్లాస్ ఫారగో రచించిన 'ది గేమ్ ఆఫ్ ది ఫాక్సెస్.' బ్రిటిషువారి, జర్మనుల తెలివితేటల సాధనలను రెండవ ప్రపంచయుద్ధం జరగడానికి ముందు, జరుగుతున్నప్పుడు రచయిత జాగ్రత్తగా ఈ పుస్తకంలో పరిశీలించారు. చాలాకాలం క్రితం పోయిన 'జర్మన్ మిలిటరీ ఇంటెలిజన్స్'—(అబ్‌వెహ్ర్) వారి మైక్రో ఫిల్ము చేయబడిన దస్తావేజులను రచయిత స్వయంగా సంపాదించి, వాటిని గురించి ఈ పుస్తకంలో వ్రాసారు. ప్రపంచ యుద్ధానికి పూర్వం ఆంగ్లేయులకు, జర్మను వారికి ఉన్న సంబంధాల విషయం దీనిలో ఉంది. 'చారత్వం' బ్రిటిష్‌వారు ముందే ప్రారంభించినా, హిట్లరు అధిపత్యానికి వచ్చిన తరువాత జర్మనులు ఆ వృత్తిలో ఆంగ్లేయులను ఓడించారు. హిట్లర్ నియమించిన చారుల సంస్థ 1939లో ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ వైమానిక దళములు, రాడార్‌లు, డాక్‌లు మొదలైన వాటి స్థావితాలు పూర్తిగా కనిపెట్ట గలగడం నవీన యుగంలో 'తెలివి వల్ల సాధించ గలిగే సాధన'ల్లో 'సాటి లేని అద్భుత కార్యం' గా పేర్కొనబడింది. చారుల సంగతి, వారి పనులు, వారందించిన సమాచారములు 'అబ్‌వెహ్ర్' దస్తావేజుల సహాయంతో ఈ పుస్తకంలో మళ్ళీ వివరింపబడింది. 30 ఏళ్ళక్రితం అమెరికాలో ఈ 'అబ్‌వెహ్ర్' సంస్థ సాధించిన కార్యాలు చూసి రచయిత ఫారగో ఆశ్చర్యపడ్డారు.



1940—'41లో సంకటమైన పరిస్థితులలో బ్రిటిష్‌వారు జర్మనుల బెదరింపునకు పరిష్కారంగా ప్రతిఘాత మొనర్చారు. సర్ జాన్ మాస్టర్‌మన్ తన 'ది డబుల్ క్రాస్ సిస్టమ్'లో చెప్పినట్లు, వారు చాల నేర్పుతో జర్మనుల గూఢచార్ల మూకలను బ్రిటన్‌లో చాల వరకు నిర్మూలింప గలిగారు. ప్రపంచయుద్ధము ప్రారంభమైన వెంటనే 'బ్రిటిష్ రక్షక సంస్థ'కు జాన్ మాస్టర్‌మన్ అధ్యక్షులై ఇరవై మందితో 'కార్య సాధన' కుపక్రమించారు. ఈ బ్రిటిష్ గూఢచార్ల అధికారులు వందలకొద్దీ జర్మనీదేశపు చారులను పట్టుకొన్నారు. మాస్టర్‌మన్ విపులీ

కరించినట్లు ఇది చాలా 'కష్టసాధ్యమైన' పని. కాని వీటి ప్రతిఫలాలు అనుగుణంగా కానవచ్చాయి. ఈ పుస్తకంలో 'బ్రిటిష్ ఇంటెలిజెన్స్' వారి అద్వితీయమైన సాధనలు తెలుపబడ్డాయి.

జర్మన్ జర్నలిస్టు హేన్స్‌హోహ్నె తన రచన 'కోడ్‌వర్డ్: డైరెక్టర్'లో జర్మనీ దేశము తన తప్పుల చేతనే ఎలా పతనమైందో తెలిపారు. దీనిలో ఆయన యుద్ధము ముగిసిన పిదప దాని ఫలితాలు వివరించారు.

పైన చెప్పిన మూడు పుస్తకాలలో అణగి మణగి, మనల్ని ఊహించుకొనేటట్లు చేసే కొన్ని యుద్ధ సంబంధమైన విషయాలు మరి రెండు పుస్తకాలు చదవడం వల్ల తెలుసుకోవచ్చు. ఈ రచనలలో జనరల్ రీన్‌హార్డ్ గెహ్‌లెన్ గురించి మనం చదువుతాము. వీటిని హేర్‌హోన్, ఆంగ్ల రచయిత ఇ. హెచ్. కుక్‌రిడ్జ్ రచించారు. ఈ పుస్తకాలలోని విషయాలు కొంతవరకూ ఒక్కలాగునే కనబడుతాయి. వీటిలో గెహ్‌లెన్ యొక్క అసాధారణమైన గుణాలు, స్వమత పరిత్యాగమూ కొనియాడ బడ్డాయి.

గెహ్‌లెన్ వృత్తిరీత్యా ఒక జర్మన్ యోదుడు. రెండవ ప్రపంచయుద్ధం జరిగిన సమయంలో 'జర్మన్ ఆర్మీ మిలిటరీ ఇంటెలిజన్స్' సంస్థకు అధ్యక్షుడయ్యాడు. అతనిని హిట్లరూ, కమ్యూనిస్టులు అసహ్యించుకొన్నారు. అమెరికా త్వరలో గొప్ప దేశంగా ప్రసిద్ధి కెక్కుతుందని గెహ్‌లెన్ ముందరే కనిపెట్టి, రష్యా గురించి విషయాలు, తన సమాచారాలు, చారుల పట్టీలతోసహా మైక్రోఫిల్మ్ చేసి దాచి, హిట్లర్ నాయకత్వం అంతం అయిన తర్వాత ఆ విషయాలన్నిటినీ అమెరికన్‌లకు తెలియజేసాడు. తర్వాత అతడు పశ్చిమ జర్మనీకి తిరిగివచ్చి, చారుల శాఖకు అధికారత్వము వహించాడు. ఈ పుస్తకాలు చదవటంవలన గెహ్‌లెన్ యొక్క విశిష్టత, చారునిగా అతని అసాధారణ ప్రజ్ఞ మనకు వెల్లడి అవుతాయి. ●

# ప్రశ్నావళి

**—కె. రామలక్ష్మి—**

**బి.వి. ఎస్, తిరుపతి**

మనం ప్రేమిస్తున్న అమ్మాయి మనల్ని ప్రేమిస్తోందో లేదో తెలియడం ఎలా?

ఏమిటి కథ? మనం అంటున్నావు. కొంపతీసి సినిమాల్లోలాగా కథల్లోలాగా—నువ్వూ, నీ స్నేహితుడూ 'నేనూ' కలిసి ఒకే అమ్మాయిని ప్రేమించడంలేదు కదా!!

**బి.వి. వి. ఎస్. [illegible]**

రామలక్ష్మి అక్కయ్యగారూ, హృదయము నసే లేచి అబద్ధములు ఆడి బ్రతుకకల వాళ్ళకు మీ సలహా ఏమిటి?

వాళ్లకి మన బోడి సలహా ఎందుకు గురూ! వాళ్లే డజనో అరో మనకి చెప్తారు. హాయి.

**బి.వి. ఎస్., చోడవరం**

ప్రశ్నావళి మానేసి రాజకీయాలలో దిగకూడదా మీరు?

రాజకీయాలు మన ఒంటికి పడవు— మరీ—సూటిగా పోయే రకం నేను— యిక్కడే యిన్ని పేచీలు వస్తున్నాయి— యిక రాజకీయాల్లో ఒక్క పూటకూడా వుండనీయరు నన్ను!

**వి. మైలవరం**

ప్రేమించి పెళ్ళిచేసుకుంటానని నమ్మించి గర్భవతినిచేసిన స్వంతవారిని ఏమనాలి?

ఇప్పుడేనా తెలిసిందా— ప్రేమ— సెక్సు చాలా దగ్గిరవని! పెళ్లి తరవాతకి కనీసం సెక్సు కూడా మిగుల్చుకోకపోతే— యింకా పెళ్లి ఆడ్డం ఎందుకు?!

**బి. ఎస్. ఆర్, కొత్తగూడెం**

ఈ నాటి నవహిప్పీ యువతులపై మీ అభిప్రాయం ఏమిటి అక్కయ్యగారూ?

ఐ లైక్ దెయిర్ డేర్‌డెవిల్ స్పిరిట్ తమ్ముడూ. మనలాంటి ఛాందసులం గుడ్లప్పగించేసి చూసినా హాయిగా అలా వుండకల్గడానికి కూడా ధైర్యం కావాలి.

**కె. ఎస్. కె, కొత్తూరు**

మితమైన ఆహారం అంటే ఏమిటి?

శరీరానికి అవసరం అయినంతగాని మనకి యిష్టమైనంత, కాదని—అర్థం.

**ఎల్. ఆర్. ఎస్, అనకాపల్లి**

కొంతమంది తల్లితండ్రులు 'మిమ్మల్ని కని పెంచినది యిందుకేనా?' అంటూంటారు. కనేటప్పుడు వాళ్లను అడిగే కంటారా?

మీ ప్రశ్న బాగుంది. కాని యిదే ఆడపిల్ల అయితే ఇలా అడిగి వుండేదికాదు— కని పెంచడంలో ఉన్న కష్టం అర్థం అవుతుంది కనుక. మన తల్లి తండ్రులనీ చుట్టాలని, మనం ఎంచుకోలేం—వారు మన కంటే ముందే వుంటారు. అంచేత తమరా రెండో ప్రశ్న అడక్కండి—నిజంగా మనలాంటి పిల్లలు పుడతారని ఏమాత్రం ఊహించినా—పాపం ఆ తల్లి తండ్రులు కనివుండరు! అది మటుకు నిజం.

**జి. సి.హెచ్., మద్రాసు**

ప్రశ్నావళి శీర్షికలో పాఠకులపేర్లు ప్రచురించకూడదంటూనే మీ జవాబులలో కొందరు పాఠకులపేర్లు ప్రచురిస్తున్నా రెందుకు?

అలాంటి పాఠకుల పేర్లు మీ అందరకీ కూడా తెలిస్తేనే బాగుంటుందని!

**ఎమ్. పి. కె, కొండగుడు**

స్త్రీ తన జీవితంలో కోరుకునేదేమిటి?

తన నొక వ్యక్తిగా చూడకల సహచరుణ్ని.

స్త్రీని దేనితో పోల్చవచ్చు?

స్త్రీతోనే!

**సి. హెచ్. బి. కె, ముప్పవరం**

స్త్రీకి కన్నీరే ఆయుధం అంటారు. ఎంతవరకు అది సత్యం.

అది పాతరాతి యుగంలో. ఇప్పుడు ఏడ్చి జయించలేమని తెలుసుకున్నారు స్త్రీలు. అంతే కాదు ఏడుపు వృథా అని కూడా తెలుసుకున్నారు.

**సంగం, నిజామాబాదు**

ఓలియిచ్చి ఆలిని తెచ్చుకునేరోజు మీరు నూరు జన్మలు ఎత్తినా రాదు. మీ కన్నులు వోర్వులేదు. ఆడవారిని ఏమన్నా మీరు ఊరోర్కారు.

చిత్తం. మీకుటుంబ స్త్రీలకి ఉన్నట్టుంది. ఎక్కడలేని వోర్పూ! నూరు జన్మలక్కరలేదు! ఇంకో రెండు తరాలు పోనివ్వండి చాలు. యిప్పటికి చాలా మంది అమ్మాయిలు మొగుళ్లని కొనుక్కోవడం అంటే అసహ్యించు కుంటున్నారు. ఆపట్టుదల కాస్త పెరిగితే చాలు—గేరు రివర్సులో పడ్డానికి!

**ఎస్. ఆర్, సునాబేడ**

భర్త గొప్పవాడై నలుగురిలో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటూవుంటే భార్య సంతోషిస్తుంది. కాని భర్త అలా కాదు. ఎందుకు?

ఎందుకేమిటి? మగవాడు కనుక—తరతరాలూ కీర్తి ప్రతిష్ఠలు నేర్పూ,సంపాదనా, పాలనా, అన్నీ మగవాని సొత్తుగా అంతా అనుకోబట్టే అలాంటి నమ్మకం వారిలో ఏర్పడిపోయింది. ఇప్పుడిప్పుడే కొంచెం తెలుస్తోంది—ఆడది కూడా మనకు పోటీ అని.. ఎలా తెలిసి వస్తోంది—మన రచయిత్రులు రాసే—భర్తల పాత్రలను చూసి కాదండీ— (కథ రాస్తే ఫెయిర్ చేసే మొగుళ్ళూ, తీవ్రంగా రాస్తుంటూంటే వంటచేసే మొగుళ్ళు) సంఘంలో వస్తున్న మార్పులు చూసి. ప్రభుత్వం చే పడుతున్న దృక్పథం చూసి—కన్ను తెరుస్తున్నారు. అదే మంచిది. ఎప్పుడూ భార్యాభర్తలూ,—నిజానికి స్త్రీపురుషులు ఒకే నాణేనికి బొమ్మా, బొరుసులు. ఒకపక్క విలువెంతో రెండో పక్కవిలువంతే కదా నాణేనికి?

**ఆర్. వి. ఎస్, కొవ్వూరు**

అక్కా మీకు సంగీతం వచ్చునా?

రాదు, సోదరి, రాదు. నా కంఠం గవ్వంగా వుంటుందని భ్రమపడి, మా బాబాయి గారు సంగీతం చెప్పించాలని చాలా తాపత్రయ పడ్డారు. ఆ దెబ్బతో ఉన్న కంఠం పోయి సంగీతం మేష్టారి ముక్కు పాడుం కంఠం అలవాటై పోయింది! మానేసిన అర్నెల్లక్కాని మనిషిని కాలేదట!

**సి. హెచ్. ఎస్. ధవళేశ్వరం**

పసిపిల్లల పెంపకం గురించి తెలుగులో ఏమైనా పుస్తకా లున్నాయా?

ఆంగ్లంలో చాలా బావున్నాయి. తెలుగులో చాలా కాలం క్రిందట దరిశి సుభద్రమ్మగారొక పుస్తకం రాసినట్టు జ్ఞాపకం. తరువాత చెన్న ఘంటమ్మ గారు దక్షిణ భారత పుస్తక సంస్థ తరఫున శిశు పోషణ మీద ఓ పుస్తకం రాశారనుకుంటాను. రాసి కనుక్కోండి.

**ఎమ్. ఆర్, ఉండ్రాజవరం**

నాస్తిక సంఘం అంటూ ఒకటి ఉన్నదని విన్నాం. దాని ఆధ్వర్యాన శ్రీ గోరా ఆ మధ్య జరిపిన పందిమాంస, గోమాంస విందుపై మీ అభిప్రాయం ఏమిటండీ?

దానికీ దీనికీ, ఏమిటి సంబంధమో, అర్థం కాలేదు సోదరి నాకు! మాంసాహారం యిష్టముంటే తినొచ్చు, లేకుంటే మాన వచ్చు. ఎవరేనాఎందుకు బలవంత పెట్టడం?!

**ఎన్. పి. ఎమ్. ఆర్, రాజమండ్రి**

'క్లాత్స్ మేక్ ది మేన్' అన్న దానితో మీ అభిప్రాయం?

నిజమే—కట్టుకున్న బట్టలను పట్టే, తిరిగే స్నేహితులని పట్టే—నీ విలువనీ సంస్కారం బయట పడతాయి.




నెమ్మదిగా ముందుకు వంగి మట్టిలోకి వేళ్ళు పోనిచ్చి నీలంరంగు పూసను పైకి తీశాడు శర్మ. నిటారుగా నిలబడి ఆ పూసను అన్ని కోణాలనుంచి పరిశీలించాడు ఆసక్తిగా.

రాజు, రావు, నాయుడు శర్మ దగ్గరగా వచ్చి అతని చేతిలో ఉన్న నీలంరంగు పూసను చూశారు.

కనుబొమలు ముడిచి చాలా తీవ్రంగా, ఏదేకంగా పూసను చూస్తున్న శర్మ వాళ్ళను గమనించనట్టే నటిస్తున్నాడు. క్షణాలు, నిమిషాలు దొర్లిపోయేకొద్దీ శర్మ పక్కన నిలబడిన వారిలో ఆతృత మరీ ఎక్కువవుతున్నది.

దానికి కొద్దిదూరంలో కూలీలు, గడ్డపారలు ఉపయోగించి అతి జాగ్రత్తగా, మేస్త్రీ చెబుతున్న సూచనల ప్రకారం గుంటలు తవ్వుతున్నారు. తవ్విన మట్టిని ఒక పక్కన గుట్టగా పోస్తున్నారు. గోతులమధ్య పగిలిన కుండముక్కలు, శిథిలమయిపోగా మిగిలిన అవశేషాలు ఎముకలు చిందర వందరగా పడి ఉన్నాయి.

కిందటి రోజు కురిసిన వర్షం నీటికి గట్లమీదినుంచి జారిన మట్టి గోతుల్లో పేరుకుపోయింది. పేరుకున్న మట్టిని తీసి పైకి వేస్తున్నారు కూలీలు. మరికొంత మంది కొత్తచోట్ల ట్రెంచిలు తవ్వుతున్నారు. ఇటువంటి త్రవ్వకాల పనిలో నేర్పు అవసరం. గత రెండు మూడు సంవత్సరాల నుంచి అటువంటి పనికి అలవాటుపడి ఉండటంచేత ఆ పనిని సులభంగా చేసుకుపోతున్నారు.

రోజంతా తవ్వమన్న చోటల్లా తవ్వటం కూలి డబ్బులు తీసుకోవటమే వారిపని. వాళ్ళుచేస్తున్న పనేమిటో వాళ్ళకే తెలీదు. ఆడకూలీలు మగకూలీలు ఎకసకా లాడుకుంటూ ఎవరిపన్లు వాళ్ళు చేసుకుపోతున్నారు.

శర్మ కోటుజేబులోనుంచి భూతద్దం తీసి అరచేతిలో పూసనుంచి పరిశీలించడం మొదలు పెట్టాడు.

'మొన్న మనకు దొరికిన నాణేలకూ ఈ పూసకూ ఏమయినా సంబంధం ఉన్నదంటారా!' అన్నాడు రాజు ఉత్సుకతను ఆపుకోలేక.

శర్మ ముఖం గంభీరంగా మారిపోయింది. కోపంతో నుదురు ముడతలు పడింది.

'మిష్టర్ రాజా! నీకెన్నోసార్లు చెప్పాను. తొందరపడి ఏ నిర్ణయానికి రాకూడదని' అన్నాడు.

'అది కాదు సార్!' అని రాజు ఏదో చెప్పబోతుంటే, నాయుడు, రావు అతన్ని వారించారు, శర్మ సంగతి బాగా తెలిసిన వారవటంచేత.

త్రవ్వకాల పని జరిగేటప్పుడు అక్కడ ఎటువంటి అవశేషాలు దొరికినా, వాటి ప్రాముఖ్యాన్ని గురించిన వివరాలు తన కంటె ముందుగా ఎవరు చెప్పినా, లేక విమర్శించినా శర్మ సహించలేడు.

ఆ క్యాంపు నిర్వాహకాధికారి శర్మ.

రాజు చిరునవ్వు లొలకబోస్తూ నుంచున్నాడు దూరంగా పనిచేస్తున్న ఆడ

కూలీల ఒంపుసొంపులను తిలకిస్తూ.

రావూ, నాయుడు ఒకళ్ళనొకళ్ళు కళ్ళ తోనే పలకరించుకున్నారు. రావు అందు కున్నాడు.

'ఎంత చిన్నవస్తువయినా మీ చూపు ల్నించి తప్పించుకుపోలేదు సార్! అందుకే మీకు ఈ ఫీల్డులో యింత పేరుంది...ఆ పూస...మీరే చూశారా...!'

బిగుసుకుపోయిన శర్మ ముఖంలో యించుకంత ప్రసన్నత కనపడింది.

ఆలస్యం చేయకుండా నాయుడు అందు కున్నాడు. 'మన భారతదేశంలోనే మిమ్మల్ని మించినవారు లేరని ఆమధ్య యూనివర్సిటీ ప్రొఫెసరు ఒకాయన అన్నారంటే అందులో అతిశయోక్తి ఎంతమాత్రం లేదని మన డిపార్టుమెంటులో ప్రతిఒక్కరికీ తెలుసును సార్!...ఆపూస చాలా ప్రాచీనమయినదనే అంటారా సార్!'

రాజు అసహ్యంగా మొహం పెట్టి దూరంగా మేటవేసిన మట్టిదిబ్బకేసి చూస్తూ ఉండిపోయాడు.

'నా దృష్టిలో ఈపూస చాలా ముఖ్య మయింది. యిటువంటి పూసను గురించి ఏ చరిత్రకారుడూ యింతవరకు ఉదహ రించి ఉండలేదనే నా గట్టి నమ్మకం. యిది తప్పకుండా క్రీస్తుపూర్వం రెండు మూడు శతాబ్దులనాటిదయి ఉండి తీరాలని నా ఊహ.' శర్మ అన్నాడు ఎట్టకేలకు.

'అంటే శాతవాహనుల కాలంనాటి దంటారా!' అన్నాడు రాజు.

అతని మాటలు వినిపించుకోనట్టే శర్మ చెప్పుకుపోయాడు. 'ఈ పూసయొక్క పరిణామం, రంగు, పైన ఉన్న నగిషీ పని యివన్నీకూడా క్రీస్తుపూర్వం ఈ ప్రాంతాల ప్రజలు వాడినవేనని స్పష్ట మవుతోంది. యిటువంటి పూసలంటే ఆనాటి స్త్రీలు యిష్టపడేవారనీ, వాటినే హారాలుగా గుచ్చుకుని ధరించేవారని అనుకో వచ్చు.'

శర్మమాటలు వింటూ ఊరుకోలేక పోయాడు రాజు. 'పూసలంటే ప్రీతి స్త్రీలకేగాని పురుషులకు లేదని ఎలా చెప్పగలం' అని ఎదురుప్రశ్న వేశాడు.

'నీకు అన్నీ సందేహాలే రాజూ!' అని రావు అతన్ని వాదించాడు.

'అవునండీ రావుగారూ! పూసల దండలు మగవాళ్ళే ఎందుకు వేసుకుని ఉండకూడదూ. ఈ కాలంలోకూడ మనం ఎంతో మందిని చూస్తూన్నాం. కోయ మొదలయిన జాతులు...' రాజు చెబుతున్నది పూర్తి కాకుండానే శర్మ చేతిలోని పూసను కోటుజేబులో వేసుకుని టెంటువేపు వెళ్ళి పోయాడు.

పక్కన ట్రెంచిదగ్గర పనిచేస్తున్న హమీద్ మట్టిచేతులు విదిలించుకుంటూ వచ్చాడు.

'శర్మ సాబ్‌కి కోపం ఎక్కువసాబ్! చిన్న పూసకోసం యింత హంగామా చెయ్యాలా!' అన్నాడు.

'యిప్పుడే కాదు. అతని తరహాయే అంత, కీర్తి ప్రతిష్ఠలన్నీ తనకే రావాలం టాడు. ఆలోచన తక్కువ. ఆవేశం ఎక్కువ' అన్నాడు రాజు టెంటుకేసి కదిలి పోతున్న శర్మకేసి కసిగా చూస్తూ.

'ఆయన సంగతి తెలిసికూడా నువ్వెందు కంత ఆవేశపడతావ్!' అని నచ్చచెప్ప బోయాడు నాయుడు.

'మీలాగ నాకు ఓర్పు తక్కువ. సరేనా!... కిందటి యేడుమాత్రం—ఎంత పబ్లిసిటీ యిచ్చాడు శర్మ. అస్థికలున్న ఎర్రమట్టి కుండను దాని పక్కనే ఉన్న యినప పనిముట్లను చూసి, సింధు నాగరి కత యిక్కడే పుట్టిందనీ, దానికి కావలసిన ఆధారాలన్నీ యిక్కడున్నాయనీ ప్రెస్ స్టేట్‌మెంటు యిచ్చాడు. అది చూసుకుని 'బాస్' హెడ్‌క్వార్టర్సు నుంచి పరిగెత్తు కొచ్చి మొహం వాచేలా చివాట్లువేశాడు. తనకు రావాల్సిన కీర్తి శర్మ కొట్టేస్తాడా అన్న ఉక్రోషంతో! కాని, తీరా ఆ అస్థి కల కుండ వట్టి కుండేననీ, దానికి చారి త్రక ప్రాముఖ్యం ఏమీలేదనీ తేల్చుకున్న 'బాస్' మరిన్ని చివాట్లుపెట్టి వెళ్ళి పోయాడు ... హు ... శర్మ అప్పుడే మర్చి పోయాడు.' రాజు కోపం వెళ్ళగక్కాడు.

'శర్మ ఎటువంటి వాడయినా అతని మాటకు మనం విలువ యివ్వాలి' అన్నాడు రావు.

హమీద్ వారందరిలోకి వయసులోనూ, అనుభవంలోనూ పెద్ద. సరదాగా, కలుపు గోలుగా మాట్లాడుతూ క్యాంపును లయి ప్లీగా ఉంచుతాడు.

'మా పిల్లగాడి మొలగట్టిన పూస, వంటిదే యిప్పుడు శర్మాసాబ్ పీకుకు పోయింది. అంతే, బస్ యింక నువ్వేం ఫికరుజేయకు రాజూ సార్!' అన్నాడు హమీద్.

రాజూ తేలికగా నవ్వాడు. రావు,నాయుడు కూడా హమీద్ మాటలకు నవ్వుకున్నారు.

శర్మకు పూసదొరికిన గుంట దగ్గరకు వెళ్ళాడు రాజు. భూమి ఉపరితలానికి ఆరడుగుల లోతు దాకా తవ్విన ట్రెంచిలు ఆ పక్కనేఉన్నాయి. పురాతన దేవాలయాల శిథిలాలు, యజ్ఞవాటికలు, బలిపీఠాలు, వాటిముందు మట్టితో కప్పబడిన శిథి లావస్థలో ఉన్న జంతువుల కళేబరాలు, మరుగుపడిన చారిత్రకసత్యాలను తెలియ జెబుతున్నాయి.

వాటిని సక్రమమయిన విధంగా ప్రజ లకు విద్యావంతులకు తెలియజెప్పవలసిన బాధ్యత అక్కడ పనిచేసే ప్రతిఉద్యోగి పయినా ఉన్నది.కాని విధినిర్వహణకంటే కీర్తికండూతి చాలా దొడ్డది చెడ్డదీను. దానికితోడు అధికారమదంకూడా తోడయితే కల్లుత్రాగిన కోతి నిప్పుతొక్కినట్టే!

యిటువంటి కోవలోవాడే శర్మ, అనీ, అతనికి విషయపరిజ్ఞానం కంటే బుకా యింపు ఎక్కువ అని రాజు అభిప్రాయం. సర్వీసులో ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా శర్మకు జ్ఞానోదయంకాలేదు, అయినా అదృష్టవంతుణ్ణి చెరిచేవాడులేడనీ, పరమ పద సోపానపటంలో అన్నీ నిచ్చెనలే ఎక్కు తున్నాడు శర్మ యింతవరకూ.

తెలివితేటలతోపాటు నిజాయితీ కార్య దీక్ష పట్టుదలతోకూడా ఉండితీరాలి. అవి గనక లోపిస్తే అక్కడ జరుగుతున్న పనంతా శుద్ధదండగే! ప్రభుత్వం తవ్వ మన్నది గనక మేము తవ్వుతున్నామను కుంటే దానివల్ల ప్రజలకు చరిత్రకారు లకూ ఏమీ ఉపయోగం ఉండదు.

శర్మ తన టెంటుకు వెళ్ళి రావ్‌కిషన్‌కు కబురుపెట్టాడు రమ్మని.

రావ్‌కిషన్ ఒక ప్రముఖ పత్రికా విలే ఖరి. శర్మకు చాలా కావలసినవాడు. అత నికి కావలసిన పబ్లిసిటీ అంతా రావ్ కిషన్ ద్వారానే జరుగుతూ ఉంటుంది. అందుకు తృణమోపణమో ముట్టజెప్తూ తుంటాడు శర్మ.

సిగరెట్టు ముట్టించి ఆలోచనలో

వచ్చాడు శర్మ. తను చేసే ప్రతిపనికి రాజు అడ్డుతగులు తున్నాడు. తనంటే అతని కసలు లక్ష్యంలేనట్లుగా ప్రవర్తిస్తు న్నాడు ఈమధ్య... తనకు విషేచేయడు, నామోషి కాబోలు...ఎంత పొగరు! ఎట్లా గయినా బుద్ధిచెప్పాలి. దేనికయినా అవ కాశం రావాలి! యిప్పుడా అవకాశం వచ్చింది. జారవిడువకూడదు.

రామ్‌కిషన్ సైకిలుదిగి టెంటుబయట వాలు కుర్చీలో పడుకున్న శర్మకు నమస్తే చెప్పి ఎదురుగాఉన్న కుర్చీలోకూర్చున్నాడు.

అలవాటు ప్రకారం వంటవాడు రెండు టీలుచేసి తీసుకువచ్చి వారిద్దరిమధ్య ఉన్న చిన్న బల్లమీదపెట్టాడు...శర్మ ఒక కప్పు అందుకుని సిప్‌చేస్తూ రామ్‌కిషన్ను కూడా తీసుకోమని సంజ్ఞచేశాడు. యిద్దరూ టీ తాగటం పూర్తయింది. సిగరెట్లు వెలిగినయి.

'మీ కొక అతిముఖ్యమయిన వార్తచెబుదా మని పిలిచాను. రేపు పత్రికల్లో ప్రము ఖంగా ప్రచురించ దగిన వార్త' అన్నాడు శర్మ.

'చెప్పండి సార్!' అన్నాడు రామ్‌కిషన్, అతను చెప్పబోయే విషయాలు రాసుకో టానికి నోట్‌బుక్ పెన్సిలు రెడీగా పెట్టుకుని.

# శిథిలాలమధ్య...

యింతలోకి రాజు, హమీద్ హడావుడిగా వచ్చారక్కడికి. రాజు చేతిలో చిలుముపట్టిన రెండు రాగిరేకులు, హమీద్ చేతిలో తప్పు పట్టిన యినప పనిముట్లు పగిలిపోయిన పింగాణీ ముక్కలు ఉన్నాయి, శర్మ ముందున్న బల్లమీద అవన్నీ పరిచారు యిద్దరూ.

శర్మ అసహనంగా కదిలాడు కుర్చీలో, 'ఏమిటివన్నీ!' అన్నాడు.

'ఈ పింగాణీ ముక్కలమీద చూడండి విదేశీయుల లిపి ఉన్నది. బొమ్మలుకూడా ఉన్నాయి. ఈ రాగి రేకుల మీద సంస్కృత, ప్రాకృత భాషల్లో రాసి ఉన్నది. బహుశ ఏదయినా దాన శాసనం కావచ్చు. చివర్న పేర్కొన్న పేర్లనుబట్టి కూడా వీటికి చారిత్రక ప్రాముఖ్యం ఉన్న దని భావించవచ్చు. యిటువంటి రాగి రేకులు మన డిపార్టుమెంటుకు యిదివర కెన్నడూ లభించలేదని గట్టిగా చెప్పగలను' అన్నాడు రాజు.

శర్మ అయిష్టంగానే ఆ రాగిరేకులను చేతిలోకి తీసుకుని వాటిమీదున్న లిపిని చదవటానికి వ్యర్థప్రయత్నం చేశాడు. అతనికి ఆ సబ్జెక్టులో ప్రవేశం లేదు. రాజు ఎం. ఏ. లో ఆ సబ్జక్టుకూడా చదివాడు.

శర్మకు కొంచెం యిబ్బందిగానే ఉన్నది. రాజు చెప్పిందాన్ని ఖండించాలంటే దానికి కారణాలు చెప్పాలి. రాగి రేకులమీద ఏమి రాసి ఉన్నదో చదవగలిగితే గదా దాని ప్రాముఖ్యాన్ని గురించి వ్యాఖ్యానం చేయ గలిగేది !

'మరి తుప్పు పట్టిన ఆ యినప ముక్కలు ఎందుకు ఏరు కొచ్చారు !' అన్నాడు శర్మ, రాజు తెలివితక్కువ తనాన్ని ఎలాగయినా బయటపెట్టాలనే ఉద్దేశంతో.

రామ్‌కిషన్ ఆసక్తిగా గమనిస్తున్నాడు.

'మీ కంటికవి యినప ముక్కలేగాని హమీద్‌కు అవి చాలా ముఖ్యమయినవిగా తోచి తీసుకువచ్చాడు' అని రాజు యినప ముక్క లను అన్నిటినీ ఒక ఆకారంలో పేర్చాడు. అది ఒక ధనస్సు ఆకారంలో ఉన్నది.

'యివన్నీకూడా చాలా ప్రాముఖ్య మున్న వస్తువుల్లాగే ఉన్నాయ్ సార్!..., యింతకూ మీరు చెబుతానన్న విశేషం ఏమిటి' రామ్‌కిషన్ అడిగాడు.

రాజు హమీద్‌ల ఎదుట పూసను గురిం చిన వివరాలు చెప్పటం అతని కిష్టం లేదు. దానిని కనిపెట్టిన ఘనత అంతా తనకే దక్కాలని శర్మ తాపత్రయం.

యింతలో జీపువచ్చి ఆగిన చప్పుడు అయింది. ఉరుమని పిడుగులా 'బాస్' జీపు దిగి టెంటు లోపలికి వచ్చాడు.

అందరూ లేచి ఆయనకు ఎదురు నడిచి స్వాగతం పలికారు. ఆయన్ని సుఖాసీనుల్ని చేశారు. ఆయన అడక్కుండానే అక్కడి విషయాలు చెప్పటం శర్మ విధి. సైగా పేరు మోసిన విలేఖరికూడా అక్కడే ఉండ టంతో 'బాస్'కు ఆవేశమూ, అను మానమూ కలిగినయి.

యిక తప్పదన్నట్లు శర్మ రాగిరేకులు పింగాణీ యినప ముక్కలుచూపి అవి



దొరికిన వైనం, వాటి విశేషం, రాజు చెప్పిన మాటలనే కొంచెం మార్చిచెప్పాడు. ఆ మాటల్లో అతనే కష్టపడి తెలివంతా ఉపయోగించి వాటిని మట్టినుంచి బయటికి తీసినట్లు, చెప్పాడు. నీలం రంగు పూస సంగతిమాత్రం చెప్పలేదు.

శర్మ చెప్పటం ఆపిన తర్వాత రాజు అందుకున్నాడు. 'శర్మగారికి ఒకపూసకూడా దొరికింది సార్!' అన్నాడు.

శర్మ కోటుజేబులోనుంచి పూసతీసి బాస్‌కు అందించాడు, భూతద్దంకూడా ఆయనముందు ఉంచాడు.

మూతి బిగించి, కళ్ళు చిట్లించి ఒకటికి రెండుసార్లు ముక్కురుద్దుకుని ఆపూసను భూతద్దంకింద పరీక్షించాడు 'బాస్'. పెదిమ విరిచాడు.

శర్మముఖ భంగిమలుకూడా దానికి అనుగుణంగా మారినయి.

రాజు వీరిద్దరినీ గమనిస్తున్నాడు ... 'బాస్' వచ్చాడని తెలిసి సైట్‌నుంచి రావు, నాయుడుకూడా వచ్చారు.

రామ్‌కిషన్‌వేపు చూసి 'క్రీస్తుపూర్వం రెండుమూడువేల సంవత్సరాలకు చెందిన కొన్ని పనిముట్లు, రాగిరేకులు, ఈ స్థలంలో దొరికినయి. వాటికెంతో చారిత్రక ప్రాముఖ్యం ఉన్నది- చరిత్రకారులకు ఇంతవరకూ లభించని కొన్ని సత్యాలు ఈ వస్తువులవల్ల తెలుసుకోవటానికి అవకాశాలు పుష్కలంగా ఉన్నాయనికూడా పేపరుద్వారా తెలియచేయండి...ఈ ప్రకటన ఇచ్చింది నేనే! గుర్తుంచుకోండి.' అని మరీ మరీ నొక్కివక్కాణించాడు 'బాస్.'

రామ్‌కిషన్ రాసుకోవటం పూర్తిచేసి బాస్ చెప్పిందానికి అంగీకారంగా తలూపాడు.

'వాట్డూ యూ సే మిష్టర్ శర్మ' అని అడిగాడు బాస్.

'యూ ఆర్ రైట్ సర్' అన్నాడు శర్మ వెంటనే.

రాజు, నాయుడు, రావు, నవ్వుకున్నారు. లోలోపల ఒకరికి రావలసిన కీర్తి మరొకరు తన్నుకుపోయినందుకు.




# కొత్త సీరియల్ నవల ప్రారంభం!



# ముగ్గురు మూర్ఖులు చెప్పిన
# అనగనగా ఒక తండ్రి

**'మనం యీ దినం బయటకు వెళ్ళడానికి అవకాశం ఉండకపోవచ్చును' అన్నాడు చిదంబరం.**

**'అవును. వర్షం యింతటితో తగ్గే సూచనలు యేమీ కన్పించడంలేదు' అని అంటూ చిదంబరం అభిప్రాయాన్ని బలపరచాడు చంచల్రావు.**

**'బయటకు వెళ్ళి మనంచేసేది కబుర్లు చెప్పుకోవడమే కదా' అందుచేత మీకు కాలక్షేపం కోసం యిక్కడే ఒక పెద్ద కథ 'అనగనగా ఒక తండ్రి నిగురించి చెపుతాను' అన్నాడు చూడామణి.**

*'సరే, కానియ్' అని చిదంబరం అనగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.*

'మంచినీళ్ళు పుచ్చుకుంటారా?' అని రామ్మూర్తిని అడిగింది శాంత, అతను యింట్లోనికి రాగానే.

'మంచినీళ్ళకేంగాని నీకో మంచివార్త చెపుతాను' అన్నాడు రామ్మూర్తి.

'మీరు యేం చెప్పినా, నాకు మంచి వార్తే.'

'అమ్మ యెప్పుడూ అలాగే అంటుంది నాన్నా! ఆ మంచివార్త యేమిటో నాకు చెప్పవూ?' అని అడుగుతూ గదిలోనుంచి బయటకు వచ్చింది లక్ష్మి.

'అన్నయ్యకు ఉద్యోగం వచ్చింది.'

'నిజమేనా నాన్నా?'

'నిజం కాకపోతే నేను అబద్ధం చెబుతానా అమ్మా?'

'అన్నయ్యా! అన్నయ్యా!' అంటూ ప్రసాద్ గదిలోనికి పరుగెత్తింది లక్ష్మి.

'అంతా భగవంతుని దయ' అన్నది శాంత.

'మీకు యెవరు చెప్పారు ఈ సంగతి?' అని ప్రశ్నిస్తూ తన గదిలోనుంచి బయటకు వచ్చాడు ప్రసాద్.

'ఎవరో చెప్పడం యేమిటి? కంపెనీ మేనేజింగు డైరెక్టరే స్వయంగా నాతో చెప్పాడు' అంటూ రామ్మూర్తి చెప్పడం ప్రారంభించాడు.

'ఈవేళ పొద్దున్నే నేను బస్సులో వెళ్ళింది ఆయనను కల్సుకోవడానికే. మన ఊళ్ళోఉన్న బ్రాంచి ఆఫీసులో అసిస్టెంటు మేనేజరు ఉద్యోగానికి నువ్వు అప్లై చేసిన విషయం ఆయనతో చెప్పాను. మొట్టమొదట ఆయన యేమీ మాట్లాడలేదు.

'మీ నాన్నగారి పేరు వెంకటేశ్వర్లు కాదా?' అని ఆయన అకస్మాత్తుగా నన్ను ప్రశ్నించారు.

'అవును' అని నేను సమాధానం చెప్పాను 'ఈయనకు మానాన్నగారి పేరు యెలాగ తెలిసిందా?' అని ఆశ్చర్యపోతూ.

'మీ నాన్నగారిని నాకు బాగా తెలుసును' అని అంటూ ఆయన నన్ను 'కూర్చో' మన్నారు. తరువాత కాఫీ యిచ్చి యెంతో మర్యాదచేశారు.

'ఆయన యెందుకు నా యెడల యింత గౌరవాన్ని చూపిస్తున్నారు?' అని ఆలోచించడం ప్రారంభించాను. అప్పుడు ఆయనే యిలాగ అన్నారు.

'చాలాకాలం క్రిందట మీ ఊళ్ళోనే మాకు భూములు ఉండేయి. ఆ భూముల విషయమై మాకు మా దాయాదులకు దావా జరిగింది. ఆ దావాలో మీ నాన్నగారు మా తరఫున సాక్ష్యం చెప్పారు. ఆయన మా తరఫున సాక్ష్యం చెప్పకుండా చేయడానికి మా దాయాదులు యెంతో ప్రయత్నించారు. యెన్నో ఆశలు చూపించారు. కాని మీ నాన్నగారు దేనికి లొంగలేదు.

ఆయన మా తరఫున చెప్పిన సాక్ష్యం వల్లనే మేము ఆ దావాలో గెలిచాము.'

'ఆ సంగతి నాకు కొంచెం కూడా తెలియదు.'

'అవును. అప్పటికి మీకు చాలా చిన్నతనం. అందుచేత మీకు యీ విషయాలు యేమీ తెలియవు. తరువాత కొద్ది రోజులకే మేము ఆ భూముల్ని అమ్మివేశాము. అందుచేత మేము మీ ఊరు రావలసిన అవసరంకూడా తీరిపోయింది. మేము దావా గెలిచిన తరువాత 'మీ నాన్నగారికి యేదైనా సహాయంచేద్దాము' అని అనుకొన్నాము కాని ఆయన మావద్దనుంచి యేమీ తీసికొనడానికి యిష్టపడలేదు. మీరు అచ్చుగుద్దినట్లు ఆయన పోలికలతోనే ఉన్నారు. మిమ్మల్ని చూడగానే ఆయన గుర్తుకు వచ్చారు.'

'అయితే మీకు మా కుటుంబాన్ని గురించి వేరే చెప్పవలసిన అవసరంలేదు. మా పెద్దబ్బాయి ప్రసాద్‌ను బి.యే వరకు చదివించాను. ఆ తరువాత చదివించడానికి నాకు శక్తిలేదు. అందుచేత మీ కంపెనీ బ్రాంచి ఆఫీసులో అసిస్టెంటు మేనేజరు ఉద్యోగానికి అప్లైచేయించాను. ఈ ఉద్యోగం మీరు మా అబ్బాయికి యిప్పించినట్లయితే, నాకు చాలా సహాయంగా ఉంటుంది.'

'మీరు సరిగ్గా సమయానికి వచ్చారు. వచ్చేనెలలో నేను యీ కంపెనీ వ్యవహారాలన్నీ వదిలేసి, అమెరికా వెడదామనుకొంటున్నాను. మా చిన్నబ్బాయి అక్కడే ఉన్నాడు. కొన్నాళ్ళపాటు నేనుకూడా అక్కడే ఉందామనుకొంటున్నాను. అందుచేత నేను యిక్కడ ఉన్నప్పుడే మీ అబ్బాయికి ఉద్యోగం వచ్చేటట్లు చూస్తాను.'

'మీ దయ.'

'దయకాదు. వెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సహాయం చెయ్యడం నా విధి. వారం పదిరోజుల్లో తప్పకుండా మీ అబ్బాయికి ఎపాయింటుమెంటు ఆర్డరువచ్చేలాగ చూస్తాను' అని ఆయన అన్నారు' అని జరిగిన సంభాషణనంతటినీ వివరించాను రామ్మూర్తి.

'అన్నయ్యా! నీకు జీతంరాగానే నాకు పట్టుచీర కొనిపెట్టాలి' అంది లక్ష్మి.

లక్ష్మిమాటకు యేమీ సమాధానం యివ్వకుండానే ప్రసాద్ తన గదిలోనికి

## అనగనగా...

వెళ్ళిపోయాడు.

'నాన్నా! నువ్వు పొద్దున్న బయటకు వెళ్ళేటప్పుడు నన్ను యెదురురమ్మన్నావు. నేను యెదురువచ్చాను. అన్నయ్యకు ఉద్యోగం వచ్చింది. కాబట్టి నాకు సినిమాకు డబ్బులు యివ్వాలి.'

'సినిమాకు వెళ్ళడానికి నీకు డబ్బుకావాలంటే, దానికి యింత చెప్పాలా? నీకు యెంత కావలిస్తే, అంత తీసికో' అంటూ రామ్మూర్తి జేబులోనుంచి పర్సుతీసి లక్ష్మి చేతికియిచ్చాడు.

'మానాన్న చాలా మంచివాడు' అని అంటూ లక్ష్మి వాళ్ళ నాన్న పర్సులోనుంచి అయిదురూపాయలు తీసికొంది.

'ఇంతకూ ఆ ఉద్యోగం నువ్వు యెదురు వచ్చినందువల్లా రాలేదు. మీ అన్నయ్య చదువువల్లా రాలేదు. మీ తాతగారు యిదివరకు వాళ్ళకు ఉపకారం చెయ్యడంవల్లా సమయానికి మీ నాన్నగారువెళ్ళి అడగడంవల్లా యీ ఉద్యోగం వచ్చింది' అన్నది శాంత.

'అవును. శాంతా! ప్రసాద్‌కు ఉద్యోగం రావడం మానాన్న చలవే. నేను ఆ ఆఫీసుకు వెళ్ళినప్పుడు ఒక బంట్రోతు నాతో చెప్పాడు, 'ఈ ఉద్యోగానికి సుమారు రెండువందల అప్లికేషనులువచ్చాయి. అప్లైచేసినవారిలో యం. ఏ చదివిన వాళ్ళు, యం. బి. ఏ చదివినవాళ్ళు కూడా ఉన్నారు'అని. ఇంతమందిని''కాదని వాళ్ళు ప్రసాద్‌కు ఉద్యోగం యివ్వడానికి కారణం మానాన్న మంచితనమే. మానాన్న చనిపోయికూడా మనకు సహాయంచేస్తున్నాడు.'

'అప్పుడే ఒంటిగంట దాటిపోయింది ముందు భోజనానికి లేవండి. తరువాత మాట్లాడుకోవచ్చును' అని అంటూ శాంత దగ్గింది.

దగ్గకుండా ఉండడానికి శాంత ప్రయత్నించింది కాని ఆమెకు సాధ్యపడలేదు.

'నీ దగ్గు యింకా తగ్గనేలేదన్నమాట. మందు తెప్పించి, వేసికొన్నావా ?

'ఆ' అంది శాంత ముక్తసరిగా.

'లేదు నాన్నా! చిన్నన్నయ్య...' అని లక్ష్మి యేదో చెప్పబోయింది,

'అన్ని సంగతులు నీకేకావాలి. లోపలికి వెళ్ళి నీ పని చూసుకో' అని లక్ష్మిని కసిరింది శాంత.

'మధ్యను దాన్ని కసరడం యెందుకు? ఇంతకూ రాజు యేమిటి చేశాడు లక్ష్మీ?'

'ముందు మీరు భోజనానికి లేవండి' అని అంటూ సంభాషణను మార్చడానికి ప్రయత్నం చేసింది శాంత.

'నువ్వు దాస్తే మాత్రం, నేను ఊహించలేనా? మందు తెచ్చిపెట్టమని చీటి, నేను యిచ్చిన పదిరూపాయలు నువ్వు రాజు చేతికి యిచ్చి ఉంటావు. చీటి యిక్కడే వదిలేసి పదిరూపాయలు పట్టుకొని, రాజు చెప్పకుండా వెళ్ళిపోయి ఉంటాడు. అంతేనా?'

'సరిగ్గా అంతే నాన్నా!'

'ఆ మందుచీటి యిలాగతే లక్ష్మీ!' అని రామ్మూర్తి అనగానే లక్ష్మి లోపలకు వెళ్ళింది.

'ఇంతకూ నువ్వు మధ్యాహ్నం భోజనం చేశావా? లేదా? నీకు ఒంట్లో బాగాలేదు. వేళ తప్పకుండా భోజనం చెయ్యాలి' అని డాక్టరు చెప్పాడు కదా!' అని శాంతను ప్రశ్నించాడు రామ్మూర్తి.

'రాజు ప్రవర్తన చూస్తుంటే భోజనం చెయ్యకుండానే కడుపు నిండిపోతున్నది. చదువు మానేసి 'నాటకాలు' అంటూ అడ్డమైనవాళ్ళతో తిరగడం; యింట్లో దొరికింది పట్టుకొనిపోయి తగలవెయ్యడం యిదీ వీడి వరస. వీడికి యీ జన్మలో బుద్ధి రాదు.'

'పోనీ లెద్దూ! వాడిది చిన్నతనం. కొన్నాళ్ళు పోతే వాడికే బుద్ధి వస్తుంది'

'ఇదుగో నాన్నా! చీటి' అని లక్ష్మి మందుచీటి తీసికొనివచ్చి, తండ్రిచేతికి యిచ్చింది.

అంతట్లో ప్రసాద్ బట్టలు వేసికొని బయటకు వచ్చాడు. ఎక్కడకో వెళ్ళడానికి సైకిలు తీస్తున్నాడు.

'అన్నయ్యా! అమ్మకు మందు' అంటూ లక్ష్మి కేకలేసింది.

'ఫ్రెండు దగ్గరకు వెళుతున్నా. మళ్ళీ యిప్పుడే వచ్చేస్తా' అంటూ ప్రసాద్ సైకిలు యెక్కి రివ్వున వెళ్ళిపోయాడు.

'చెప్పినపని ఒకప్పుడు వాడు చేశాడు కనుకనా? వాడికి పని చెప్పడం యెందుకు? వాడిచేత చెయ్యనని అనిపించు

కోవడం యెందుకు?' అని లక్ష్మినే చివాట్లు పెట్టింది శాంత.

'అమ్మా! ఇలాగ రా!' అంటూనే రామ్మూర్తి తనే ఒంటికాలితో లేవడానికి ప్రయత్నించాడు కాని లేవలేకపోయాడు.

లక్ష్మి తండ్రిదగ్గరకు వచ్చి అతను లేవడానికి సహాయంచేసి, ఊతకర్రలను అందించింది.

'ఇంటి సంగతి యెవరూ పట్టించుకోవడంలేదు మీరు మాత్రం యీ యెండలో శ్రమపడి వెళ్ళడం యెందుకు?' అన్నది శాంత.

'ఎవరూ పట్టించుకోవడంలేదని నేను ఊరుకోగలనా?' అంటూ రామ్మూర్తి మండుటెండలో ఊతకర్రలతో 'టకటక' అని చప్పుడు చేస్తూ మందుకోసం బయల్దేరాడు.

'మందు తెచ్చిపెట్ట'మని తల్లి డబ్బు యిచ్చినా కూడా ఒక్క కొడుకూ మందు తేలేదు. నా తండ్రికి నేను యెంత సేవ చేశాను?' అని రామ్మూర్తి తనలో తాను అనుకొన్నాడు.

* * *

రామ్మూర్తి స్వగ్రామం అక్కడకు సుమారు పదిమైళ్ల దూరంలో ఉన్న కొత్తపాలెం. రామ్మూర్తి తండ్రి వెంకటేశ్వర్లు సామాన్యుడైన రైతు. వెంకటేశ్వర్లుకు రామ్మూర్తి ఒక్కడే కొడుకు. రామ్మూర్తి స్కూలుఫైనలు మంచి మార్కులతో ప్యాసు అయ్యాడు. ఆటల్లోకూడా చాలా బహుమతులు వచ్చాయి. కాలేజీలో చేరి యింకా చదవాలని రామ్మూర్తికి కోరిక ఉండేది. వెంకటేశ్వర్లుకూడా కొడుకును చదివిద్దా మనుకొన్నాడు. కాలేజీలో సీటు కోసం అప్లికేషను కూడా పంపాడు రామ్మూర్తి.

సరిగ్గా అదే సమయంలో రామ్మూర్తి తల్లి చనిపోయింది. చదువుకోసం రామ్మూర్తి పట్నంవెళ్ళిపోతే, వెంకటేశ్వర్లు ఒక్కడూ ఉండవలసి వస్తుంది. ఇంట్లో రామ్మూర్తి తప్ప వేరే మనిషిలేడు. అందుచేత రామ్మూర్తి చదువు కొందామనే కోరికను చంపుకొని తండ్రివద్దనే ఉండిపోయాడు.

'నేను ఒక్కడనే ఉండగలను. ఫరవాలేదు నువ్వు పట్నంవెళ్ళి చదువుకో' అని తండ్రి చెప్పినాకూడా, వృద్ధాప్యంలో తండ్రిని ఒంటరిగా వదలి వేయడానికి రామ్మూర్తి మనస్సు అంగీకరించలేదు. రామ్మూర్తి యింటివద్దనే ఉండి తండ్రికి వంట చేసిపెడుతూ, వ్యవసాయంలోకూడా తోడుగా ఉండేవాడు.

వెంకటేశ్వర్లుకు దూరపు చుట్టం శేషయ్య. వరుసకు అతడు వెంకటేశ్వర్లుకు బావమరది అవుతాడు. శేషయ్యకు శాంత ఒక్కర్తే సంతానం.

రామ్మూర్తికి శాంతతో వివాహాన్ని జరిపించాడు వెంకటేశ్వర్లు. శాంత సార్థక నామధేయురాలు, అనుకూలవతి.

తరువాత కొద్దికాలానికే వెంకటేశ్వర్లుకు బాగా జబ్బుచేసింది. వైద్యం నిమిత్తం తండ్రిని పట్నం తీసికొని వచ్చాడు రామ్మూర్తి. 'కొంతకాలంపాటు వెంకటేశ్వర్లు వైద్యం చేయించుకోవలసి ఉంటుంది' అని డాక్టర్లు చెప్పడంతో రామ్మూర్తి పట్నంలోనే కాపురంపెట్టాడు.

ఊళ్ళోఉన్న పొలాన్ని కౌలుకు యిచ్చివేసి, రామ్మూర్తి పట్నంలోని ఒక బట్టల కొట్టులో గుమాస్తాగా చేరాడు. అతను పట్నంలో ఉండడానికి ఒక యిల్లుకూడా కొన్నాడు.

తరువాత మూడు సంవత్సరాలకు వెంకటేశ్వర్లు చనిపోయాడు. రామ్మూర్తి తరువాతకూడా కొత్తపాలెం వెళ్ళకుండా పట్నంలోనే స్థిరపడిపోయాడు.

మరికొంత కాలానికి వారికి ముగ్గురు సంతానం కలిగారు. వారే ప్రసాద్, రాజా, లక్ష్మి.

* *

ప్రసాద్ ఆ ఉదయమే ఉద్యోగంలో చేరడానికి వెళుతున్నాడు. అతను బట్టలు వేసుకొని, తను తీసుకొని వెళ్ళవలసిన కాగితాలు చూస్తున్నాడు.



'అన్నయ్యా! నువ్వు కళ్ళు మూసుకొని నోరు తెరు' అంటూ లక్ష్మి ప్రసాద్ గదిలోనికి వచ్చింది.

'పెన్ను కనపడక నేను చస్తుంటే, మధ్యను నీ గొడవ యేమిటి?' అని విసుక్కొన్నాడు ప్రసాద్.

'నీ పెన్ను అక్కడ టేబులుమీదనే ఉంది. వెనకటికి నీలాంటి ఆవిడే ఉయ్యాల్లో బిడ్డను పెట్టుకొని ఊరంతా వెతికిందట. ముందు నీ నోరు తెరు.'

'ఏమిటే అది? నన్ను చూడనియ్యి.'

'మా అన్నయ్యకు పెద్ద పెద్ద ప్రమోషన్లు రావాలని దేవుడికి నమస్కారం చేసి ప్రసాదం తీసికొని వచ్చాను.'

'నాకు పెద్ద పెద్ద ప్రమోషన్లు రావాలని దేవుడికి నమస్కారం చేశావా? లేకపోతే నీకు మంచిమొగుడు రావాలని నమస్కారం చేశావా?'

'ఛీ! పో!' అని అంటూ లక్ష్మి ప్రసాద్ చేతిలో ప్రసాదాన్ని పెట్టి గదిలో నుంచి బయటకు పరుగెత్తింది.

'అమ్మా! నేను ఆఫీసుకు వెడుతున్నా' అని అంటూ ప్రసాద్ గదిలోనుంచి బయటకు వచ్చాడు.

'బాబూ! నువ్వు యిప్పుడు భోజనం

# అనగనగా...

చెయ్యలేదు కదా! మధ్యాహ్నం భోజనానికి యింటికి రావడానికి వీలు ఉంటుందా?'

'మధ్యాహ్నంవేళ గంటసేపో, గంటన్నరసేపో, 'లంచ్ బ్రేక్' అని ఆఫీసు మూసివేస్తారు. అప్పుడు భోజనానికి వస్తాను. సైకిలుమీద రావడమే కదా! ఎంత సేపు?'

'అన్నయ్యా! నీకు యిష్టమైన వంకాయపచ్చడి చేస్తున్నా, తొందరగా భోజనానికి వచ్చేయ్'

'అలాగే' అంటూ ప్రసాద్ సైకిలు యెక్కి ఆఫీసుకు బయల్దేరాడు.

'ప్రసాద్ గారూ! నేను యిక్కడ అక్కౌంటెంటును. నా పేరు సుబ్బారావు. మేనేజరు నరసింహంగారు పదిహేనురోజుల పాటు సెలవుపెట్టి యాత్రలకు వెళ్ళారు. మన ఆఫీసుకు అసిస్టంటు మేనేజరుగా మీవంటి యువకుని నియమించడం నాకు చాలా సంతోషంగా ఉంది. ప్రత్యేకంగా మీ గురించి మేనేజింగు డైరెక్టరుగారు ఉత్తరంకూడా రాశారు.'

'థేంక్స్'

'అది మీ గది' అంటూ ప్రసాద్‌ను అతను ఒక గదిలోనికి తీసికొని వెళ్ళాడు.



మీకు మన స్టెనోను పరిచయం చేస్తాను అని సుబ్బారావు రెండుసార్లు బెల్లు నొక్కాడు.

సుమారు పద్దెనిమిది సంవత్సరాల వయస్సూ, ఎదుటివారిని ఆకర్షించే రూపంగల ఒక యువతి వయ్యారంగా నడుస్తూ గదిలోనికి వచ్చింది.

'ఈమె మిస్ కాంచన. మన ఆఫీసులో స్టెనోగా పని చేస్తున్నది. వీరు ప్రసాద్ గారు మన ఆఫీసుకు అసిస్టెంటు మేనేజరుగా నియమింపబడ్డారు' అని సుబ్బారావు యిద్దరనూ పరిచయం చేశాడు.

'నమస్తే' అన్నది కాంచన

'నమస్తే' అన్నాడు ప్రసాద్ ఆమెను చూసి, కొంచెం తడబడుతూ.

'మన ఆఫీసులో యీమె సుమారు ఆరుమాసాల నుంచి పనిచేస్తున్నది. అందుచేత ఆఫీసు వ్యవహారాలు చాలవరకు యీమెకు తెలుసును. మీకు యేదైనా సందేహం వస్తే యీమెను అడగండి లేదా నన్ను పిలవండి' అని అంటూ వెళ్ళిపోయాడు సుబ్బారావు.

'ఈదినం వచ్చిన ఉత్తరాల ముందు చూడండి' అని అంటూ కాంచన కొన్ని ఉత్తరాలు తీసికొనివచ్చి ప్రసాద్ టేబులు మీద ఉంచింది.

'ఈ ఉత్తరాలు పూర్తిగా అర్థం కావాలంటే, యింతకు ముందు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు తెలియాలిగదా!'

'వాటికి సంబంధించిన ఫైళ్ళు చూసి నేను మీకు చెబుతుంటాను లెండి' అని కాంచన ఫైళ్ళను తీసికొనివచ్చింది.

ప్రసాద్‌కు యెదురుగా టేబులుకు అటువైపున కాంచన కూర్చున్నది.

ఒక్కొక్క ఉత్తరం తీసి ప్రసాద్ చదవడం ప్రారంభించాడు. ఆ ఉత్తరానికి సంబంధించిన ఫైలును చూసి, కాంచన ప్రసాద్‌కు అదివరకు జరిగిన వివరాలను చెప్పడం మొదలుపెట్టింది. ఆ సమయంలో ప్రసాద్ ఉత్తరాలకంటే కాంచననే యెక్కువ శ్రద్ధగా చూశాడు. కాంచన ఆ విషయాన్ని గమనించకపోలేదు.

ఒంటిగంట అయింది.

'మీక్కూడా టిఫిన్ యిక్కడకే తెప్పిస్తాను' అన్నది కాంచన.

'వద్దండి! ఇంటికి...' అని యేదో చెప్ప బోయాడు ప్రసాద్.

'సారీ! ఇంటిదగ్గర మీ శ్రీమతి యెదురు చూస్తూ ఉంటుంది' అన్నది కాంచన.

'అబ్బెబ్బే! నాకు పెండ్లేకాలేదు.'

'అలాగా? అయితే మనం యిద్దరం కలసి యిక్కడే టిఫిన్ చేయవచ్చును' అన్నది కాంచన ప్రసాద్ కళ్ళలోనికి చూస్తూ.

'అలాగే' అన్నాడు ప్రసాద్ నిస్సహాయంగా.

కాంచన చూపును నిరాకరంచగల శక్తి అతనికి లేకపోయింది. 'మనం యిద్దరం కలసి యిక్కడే టిఫిన్ చేయవచ్చును' అని కాంచన అనగానే 'భోజనానికి యింటికి రమ్మ'నమని తల్లి, చెల్లెలు చెప్పినమాటను పూర్తిగా మరచిపోయాడు ప్రసాద్.

సాయంత్రం ఆఫీసు మూసివేయగానే యింటికివచ్చాడు ప్రసాద్.

'మధ్యాహ్నం నీకోసం యెదురుచూస్తూ రెండుగంటలవరకూ నేను భోజనం చెయ్యలేదు' అన్నది లక్ష్మి.

'హోటల్లో అయినా, మధ్యాహ్నం భోజనం చేశావా?!' అని ప్రశ్నించింది శాంత.

'మధ్యాహ్నం ఆఫీసులోనే టిఫిన్ చేశాను. మేనేజరుగారూ, అక్కౌంటెంటూ కూడా శెలవు పెట్టారు. ఆఫీసు పని అంతా నేనే చూడవలసివచ్చింది. అందుచేత మధ్యాహ్నం భోజనానికి యింటికి రావడానికి వీలుకాలేదు' అని అంటూ ప్రసాద్ తన గదిలోనికి వెళ్ళిపోయాడు.

బట్టలు మార్చుకొని మళ్ళా బయటకు వెళ్ళబోతున్నాడు ప్రసాద్.

'రాత్రికి భోజనాని అయినా, తొందరగా రా. ఆలస్యం చెయ్యకు' అంది శాంత.

'అలాగే' అని అంటూ బయటకు వెళ్ళిపోయాడు ప్రసాద్.

తరువాత కొంచెంసేపటికే రాజు ఆదుర్దాగా యింటికివచ్చాడు.

'అమ్మా! నాకు అర్జంటుగా అయిదు రూపాయలుకావాలి' అని అడిగాడు రాజు. వంటచేస్తున్న శాంతను.

'అంత అవసరం యేమిటి వచ్చింది?'

'పుస్తకం కొనుక్కోవాలి'

'ఏం పుస్తకం?'

'ఏదో నాటకం పుస్తకం అయి

# అనగనగా...

ఉంటుంది' అన్నది లక్ష్మి మధ్యలో జోక్యం చేసికొని.

'కాదు అమ్మా! ఇది అన్నీ అబద్ధాలే చెబుతుంది. పి. యూ. సి. పరీక్షకు మళ్ళా చదువుతున్నాను. దానికి ఒక గైడు కొనుక్కోవాలి.'

'వట్టిదే. చిన్నన్నయ్య చెబుతున్నదే అబద్ధం. మొన్న మధ్యాహ్నం అందరూ నిద్రపోతున్నప్పుడు, వీడు యేం చేస్తున్నాడో తెలుసా? వీధి గదిలో నిలబడి తులాభారం నాటకంలోని నారదుడిమాటలు అన్నీ ప్రాక్టీసు చేస్తున్నాడు. ఏక్షనుకూడా చేస్తున్నాడు. నేను చూశాను.'

'అంతా అబద్ధం అమ్మా! అయిదు రూపాయలు యివ్వవూ?'

'ఇస్తాను. మీ నాన్నగారు యింటికి రానియ్యి.'

'నాన్నగారు వచ్చేవరకూ ఉంటే యీ లోపున పుస్తకాల కొట్లు మూసివేస్తారు.'

'అయితే, రేపు కొనుక్కోవచ్చును. నా దగ్గర డబ్బులులేవు.'

'మళ్ళీవస్తాను' అంటూ రాజు బయల్దేరాడు.

'వంట అయిపోవచ్చింది. భోజనంచేసి వెళ్ళు' అని కేకవేసింది శాంత.

'ఇప్పుడే వస్తాను' అంటూ రాజు వెళ్ళిపోయాడు.

గంటసేపు అయిన తరువాత రాజు తిరిగి యింటికివచ్చాడు. భోజనంచేసి మళ్ళీ బయల్దేరాడు.

'చదువుకుంటానని అన్నావుకదా! మళ్ళా యెక్కడకు ప్రయాణం?' అని అడిగింది శాంత.

'లాడ్జికి వెళ్ళి చదువుకుంటాను.'

'ఏం లాడ్జో? ఏం చదువో?' అని శాంత అంటూ ఉండగానే రాజు వెళ్ళిపోయాడు.

* * *

'రాజు భోజనం చేశాడా?' అని శాంతను అడిగాడు రామ్మూర్తి యింటికిరాగానే.

'ఆ! భోజనంచేసి వెళ్ళాడు.'

'డబ్బుకోసం వాడిని నువ్వు నాదగ్గరకు పంపించావా?'

'అబ్బే. వాడిని డబ్బుకోసం మీ దగ్గరకు నేను పంపించలేదు. ఏదో పుస్తకం కొనుక్కోవడానికి అయిదురూపాయలు కావాలనివాడే అడిగాడు, మీరు యింటికి వచ్చేవరకు ఉండమన్నాను.'

'నేనూ అలాగే అనుకొన్నానులే. వాడిని నువ్వు పంపలేదు. 'వాడికే యేదో అవసరం ఉండి, యిలాగ అడుగుతున్నాడు' అని నేను అప్పుడే గ్రహించాను.'

'అయితే అయిదు రూపాయలు మీరు వాడికి యిచ్చారా?'

'ఇచ్చాను.'

'అమ్మా! అమ్మా!' అని కేకలు వేస్తూ లక్ష్మి యింట్లోకి వచ్చింది.

'నేను నీతో చెప్పింది అబద్ధం అని రాజు అన్నాడుగా! ఇదిగో యీ పేపరు చూడు పక్కింటి సుగుణ యిచ్చింది. అక్కడ యెక్కడో నిన్నరాత్రి తులాభారం నాటకం వేశారట. అందులో రాజు నారదుడు వేషం వేశాడట' అని లక్ష్మి ఆతృతగా చెప్పింది.

లక్ష్మి యిచ్చిన పేపరును శాంత చదివి రామ్మూర్తి చేతికి యిచ్చింది. రామ్మూర్తి కూడా దానిని చదివాడు.

'మీరు అలాగ డబ్బులు యిస్తూ ఉండండి. వీడు యిలాగ నాటకాలువేస్తూ ఉంటాడు' అన్నది శాంత.

'ఏ నాటకాలు వేసినా యీ వయస్సులోనే కదా వేస్తాడు. కొంచెం పెద్దవాడు అయితే, వాడే మానేస్తాడు. ఇప్పుడు నువ్వు నన్ను నాటకాలు వేయమంటే మాత్రం నేను వేయగలనా? అసలు చిన్నప్పుడు నేను యెంత అల్లరి చేసేవాడినో నీకు తెలుసా?' అని హాస్యంగా ప్రశ్నించాడు రామ్మూర్తి.

'అయితే యిప్పుడు మాత్రం మాని వేయడం యెందుకు? ఇప్పుడు కూడా అల్లరి చేయండి. ముందు భోజనానికి లేవండి' అని అంటూ శాంత వంటగది లోనికి వెళ్ళిపోయింది.

(ఇంకా వుంది)

## ప్రబోధం

జరిగిపోయిన ఎన్నోయేళ్ళ చరిత్ర చదివి
తెలుసుకొన్నాను దూరాన యుద్ధం జరుగుతున్నదని.
మంచిమనసు ఉన్నవాళ్ళు పట్టించుకోరా?
వివేకం ఉన్నవాళ్ళు వినిపించుకోరా?
తోడి మానవుల దుష్టవర్తనలు
మాన్పించాలని మానవసంఘం
పోరాడే తరుణం యిది.
వక్రబుద్ధుల నివాసాలలో
వ్రేలాడే విచ్చుకత్తులు
మాయం కాదగిన సమయం ఇది!

శాంతి సత్యాల వ్యాప్తికోసం
అంకురార్పణకు అదను యిదే!
శోచనీయమైన ఉన్మాదాలకూ
పొగరుబోతుల దుర్మార్గాలకూ
స్వస్తిని చెప్పే సమయం ఇదే!
సమరం నడపగ సహకరించే ఆశావాదుల ఆర్థిక నిర్మితి
బూడిదకానీ.
శ్రమజీవుల కృషి శ్రేయోవృద్ధులు ప్రపంచంలో ఫలించినవై
స్థిరంగా ఉండనీ.

పోర్చుగీసు మూలం: ఇనో టియోడోరో వాన్‌కే

అనువాదం: బులుసు వేంకటరమణయ్య.

# మాతృమూర్తి

ఈ పేరుగొన్న చిత్రాన్ని విశ్వజ్యోతి పిక్చర్స్ నిర్మిస్తున్నారు. లోగడ 'మా అమ్మ దేవత'గా యీ చిత్రం మీకు పరిచితమే. ఈ సంస్థకు కె. సత్యనారాయణ, రాజేంద్రకుమార్ అధినేతలు.

## హరనాధ్—సరోజాదేవి

పై చిత్రంలో హరనాధ్— సరోజాదేవి దంపతులుగా నటిస్తున్నారు. మరొక జంటగా చంద్రమోహన్— అనిత కనిపిస్తారు. దుష్ట పాత్రను కృష్ణంరాజు పోషిస్తున్నారు. కామెడీ వేషాలను రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య ధరిస్తున్నారు. అంజలీదేవి టైటిల్ పాత్రధారిణి. మరొక ముఖ్య భూమికను పండరీబాయి నిర్వహిస్తూంది. ఈ చిత్రానికి రాజశ్రీ రచన్ను, పెండ్యాల సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, కుమార్ కళను, దాసరి నారాయణరావు కో—డైరెక్షన్ను నిర్వహిస్తున్నారు. మానాపురం దర్శకత్వంలో తయారవుతున్న యీ చిత్రం శ్రీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

## కథ

ఇల్లరికం వెళ్ళిన అల్లుడు, మామగారి ఆస్తిని హారతి కర్పూరంలా కరగించి, తాళి కట్టిన భార్యను విస్మరించి, తల్లిని, తమ్ముడ్ని అవమానించి, చివరికి తన తప్పును గుర్తించి, కుటుంబ సభ్యులతో కలసి బ్రతకడమే 'మాతృమూర్తి' కథ.



'అబ్బాయిగారు—అమ్మాయిగారు'లో వాణిశ్రీ, కృష్ణ.

# సినిమా

## వాసంతి కొత్త చిత్రం

నటిగా ప్రవేశించి, వున్నంతకాలం మంచిపేరును సంపాదించి, కొంతకాలానికి నిర్మాతగా మారి, కొన్ని డబ్బింగ్ చిత్రాలను నిర్మించి, వాటి ద్వారా విశేష లాభాలను ఆర్జించి, గత ఏడు 'భలేపాప'ను పంపించిన వాసంతి సెప్టెంబరు 5 న రెండవ చిత్రాన్ని శారదా స్టుడియోలో ప్రారంభించింది.

శ్రీ కల్పనాలయ నిర్మించే యీ చిత్రానికి పి. ఏ. పి. సుబ్బారావు స్విచ్ ఆన్ చెయ్యగా, తమిళనాడు శాసనసభ్యుడు కాలిముత్తు క్లాప్ కొట్టారు. రాజకీయ నాయకులు, సినిమా ప్రముఖులు వచ్చి వాసంతికి, ఆమె భర్త శ్రీనివాస్‌కి (డిప్యూటీ స్పీకర్న్) శుభాశీస్సులు వచించారు.

## జమున—జగ్గయ్య!

పై చిత్రానికి పినిశెట్టి మాటలను, విశ్వనాధన్ సంగీతాన్ని, భాస్కరరావు ఛాయను, దిలీప్‌సింగ్ కళను, నరసింహరావు కూర్పును నిర్వహిస్తున్నారు. ఇంతకీ దర్శకుడ్ని గూర్చి వ్రాయలేదు కదూ 'ద్రోహి' చిత్రం చూసే వుంటారనుకుంటా. ఆయన పేరు కె. బాపయ్య అని మీకు తెలుసనుకుంటా. ఆయనే వాసంతి చిత్రాన్ని డైరెక్ట్ చేస్తున్నారు. నాయకీ, నాయకులుగా జమున, జగ్గయ్య నటిస్తున్నారు. ప్రధాన పాత్రలను చంద్రమోహన్, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, కె. వి. చలం పుష్పలత, ప్రముఖాల పోషిస్తున్నారు.

'చదువు, సంస్కారం, పదవి, గౌరవం అందరికీ



'విచిత్రబంధం'లో వాణిశ్రీ, మాస్టర్ రమేష్.

అందుబాటులో వుండే సొత్తు' అనేడి నిజాన్ని నిరూపించే చిత్రం యిది.

## ఉషశ్రీలో

## నూతన త్రయం!

మూడు విజయవంతమైన చిత్రాలను నిర్మించిన ఉషశ్రీ సంస్థ అక్టోబర్ 2న నాలగవ చిత్రాన్ని ప్రారంభించబోతూంది. ఈసారి ముగ్గురు కొత్తవాళ్ళు పరిచయం అవుతున్నారు.

చిత్రాన్ని డైరెక్టు చెయ్యబోయే వ్యక్తి చిన్నపరెడ్డికి యిది మొదటి అనుభవం. హీరోగా నటించబోయే యువకుడు ప్రకాష్‌కి యిది తొలి చిత్రం. రెండు పాటలను వ్రాసిన పరిగె రాధాకృష్ణ్కకి యిది ప్రథమ అవకాశం.

## ప్రేమ పక్షులు

ఈ చిత్రానికి 'ప్రేమ పక్షులు' అని పేరు పెట్టారు. కథను ఉషశ్రీ వ్రాయ, సినిమా అనుకరణను చిన్నపరెడ్డి రచింప, మాటలను మోదుకూరి జాన్సన్ సమకూరుస్తున్నారు. ఒక్క దర్శకుడు తప్ప, మిగతా టెక్నికల్ యూనిట్ పాతవార్గమే. విడుదల అనిల్ ప్రభాస్.

## చంద్రకళ

'ప్రేమ పక్షులు' చిత్రంలో ముగ్గురు కథానాయికలున్నారు. చంద్రకళ, విజయలలిత, కృష్ణకుమారి ఆ పాత్రలను పోషిస్తారు. ప్రకాష్‌తో చంద్రకళ, కృష్ణంరాజుతో కృష్ణకుమారి జంటగా నటిస్తారు. హాస్యం రాజబాబు పరం చేస్తారు. నిర్మాత పి. చిన్నపరెడ్డి.

# సినిమా

## ముఖ్య నగరాల్లో నవశక్తి చిత్రం

నవశక్తి ప్రొడక్షన్స్ నిర్మించబోయే కొత్త చిత్రం షూటింగ అక్టోబర్ మొదటి వారంలో ప్రారంభ మవుతుంది. నిర్మాత గంగాధరరావు తలపెట్టిన యీ చిత్రంలో నటీనటులందరూ కొత్తవాళ్ళు గావడం ఒక విశేషం. వీళ్ళు సినిమాకి కొత్త అయినా, అనేక నాటక, నాటికల్లో విశేషప్రజ్ఞను అగుపరచి, బహుమతుల నందుకున్నవారే. ఈ చిత్రంలో కనిపించే పాత్రలకి, వాటి వయస్సుకు సరితూగే కళాకారుల్ని ఎన్నుకోవడం, ముదావహం.

## పనికి వచ్చే వాళ్ళు!

నవశక్తి ఆఫీసులో గంగాధరరావు టేబిలుపై ఆయన ఎన్నుకున్న తారల ఛాయాచిత్రాలను చూశాను. అందరూ పనికి వచ్చేవాళ్ళుగా నా కంటికి అగుపించారు. గంగాధరరావు చేస్తున్న యీ కొత్త ప్రయోగం ప్రేక్షకుల మదిని సంతృప్తిపరిస్తే, చిత్ర పరిశ్రమలో పెద్ద మార్పు వస్తుంది. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. సంగీతాన్ని సత్యం, ఛాయను ఎస్. ఎస్. లాల్, కళను సూరన్న నిర్వహిస్తారు. మాటలను విద్వాన్ కణ్వ శ్రీ వ్రాశారు.



'మాయింటి వెలుగు'లో హలం.

ఈ చిత్రానికి స్టుడియో అవసరం యిసుమంతయినా వుండదట. ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య నగరాల్లో షూటింగును జరుపుతారట. విశాఖపట్నంలోని థియేటర్ ఆర్ట్స్ వారు గంగాధరరావుకు తమ సంపూర్ణ సహకారాన్ని యిస్తామని మాట నిచ్చినారట.

## జమున నటించే కొత్త చిత్రం

ఇటీవల ఒక కొత్త నిర్మాణ సంస్థ వెలసింది. టి. ఏ. ఎస్. మూవీస్ పేరిట వెలసిన ఆయ్యే యీ సంస్థను నల్ల రామచంద్రరావు నిర్మించారు. వీరి ప్రథమ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు.

'పంచ కళ్యాణి— దొంగలరాణి' 'కథానాయకురాలు' చిత్రాల్లో భాగస్వామిగా యుండిన నల్ల వెంకట్రావు సమర్పించే యీ చిత్రానికి దాసం గోపాల కృష్ణ మాటలను, సుకదేవ్ ఛాయను, ఎ. ఎ. రాజ్, సంగీతాన్ని అంకిరెడ్డి కూర్పును,



'మాతృమూర్తి'లో జ్యోతిలక్ష్మి.

భాస్కరరాజు కళను నిర్వహిస్తున్నారు.

'మేడమ్' జమున కథానాయకిగా నటించడానికి అంగీకరించిన యీ చిత్రంలో సత్యనారాయణ, నాగయ్య, కె. వి. చలం, డా. రంగారావు, దేవిరాణి, ఛాయాదేవి, మీనాకుమారి, సూరంతి ముఖ్యపాత్రధారులు. ఈ చిత్రానికి నల్ల సూర్యచంద్రరావు సహనిర్మాత.

## జమున, వాణిశ్రీ నటించే చిత్రం

ఆర్. ఆర్. పిక్చర్స్ వారి 'మా యింటి దేవత'లో వాణిశ్రీ, జమున కలిసి నటించిన విషయం పాఠకులకు తెలుసు. మళ్ళీ యీ యిద్దర్నీ ఒకే చిత్రంలో చూచే అవకాశాన్ని నిర్మాత ఎస్. భావనారాయణ కలిగిస్తున్నారు. కృష్ణ నాయకుడు. 'పండంటి కాపురం' ఫేం లక్ష్మీ దీపక్ దర్శకుడు. పూర్ణా విడుదల.

## హిందీ పండంటి కాపురం

హీరో కృష్ణ— పిసస్ పిక్చర్స్ సంయుక్తంగా హిందీ 'పండంటి కాపురం' నిర్మాణానికి పూను కున్నారు. ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వంలో తయారు అయ్యే యీ చిత్రంలో జరూరత్ నాయకుడు, దోరహా నాయిక బుక్ అయ్యారు.

## కృష్ణ నాయకత్వంలో గౌరిశంకర్ పిక్చర్స్!

ఈ సంస్థ యేర్పడడానికి ముఖ్యకారకుడు పల్లంరెడ్డి ప్రసాద్. ఇతగాడికి చిత్రపరిశ్రమతో యిరవై యేండ్ల సంబంధం వుంది. కొంతకాలం దర్శకత్వశాఖలో, మరి కొంతకాలం నిర్వహణశాఖలో ప్రవేశం వుండడం చేత, ఆర్టిస్టుల, టెక్నిషియన్ల సహకారం లభ్యమైంది. తను సంపాయించిన మంచి తనాన్ని నిర్మాతలు గుమ్మడి వీరయ్య, ఆర్. కోటేశ్వరరావుల కోసం వినియోగపరిచారు. ఈ సంస్థకి పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు. షూటింగు సెప్టెంబర్ 25న జ్యోతి స్టుడియోలో ప్రారంభ మవుతుంది.

పై చిత్రానికి పినిశెట్టి రచన్ను, మల్లియరాని ఛాయను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, వీరప్ప కూర్పును, సోమనాథ్ కళను నిర్వహిస్తారు.

కథానాయకుడు కృష్ణ, నాయికగా కాంచన నటిస్తుంది. ప్రధాన పాత్రలను అంజలీదేవి, రమాప్రభ, సంధ్యారాణి, కృష్ణంరాజు, చంద్రమోహన్, ధూళిపాళ, అల్లు రామలింగయ్య ముక్కామల, ఏడిద నాగేశ్వరరావు పోషిస్తారు. తారకరామ విడుదల.



'ఇల్లు—ఇల్లాలు'లో వాణిశ్రీ, కృష్ణ.

# సినిమా

## కథ కావాలి

పాఠకులారా! మీ దగ్గర మంచి కథ వుంటే నందినీ ఫిలింస్‌కి పంపండి. వాళ్ళకి బరువైన కథాసంవిధానంతో సాగే కుటుంబ చిత్రానికి అనువైన కథ అవసరమట. కృష్ణ— వాణిశ్రీ ప్రధాన పాత్రలను పోషిస్తారు. షూటింగు జనవరిలో ప్రారంభమవుతుంది. కె. సుబ్బిరెడ్డి సమర్పించే యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## పైలెట్‌గా నాగేష్, జర్నలిస్టుగా రాజబాబు

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'పాపం పసివాడు' చిత్రంపై ఆంధ్ర ప్రేక్షకులకు పెద్ద హోప్ వుంది. 'రౌడీరాణి' విజయం కన్నా 'పాపం పసివాడు' మిన్నగా వుండగలదని ప్రజలు ఆశిస్తున్నారు. కారణం— మామూలు కథలకి భిన్నంగా యీ చిత్రం వుంటుందని వాళ్ళ నమ్మకం. వాళ్ళు పెట్టుకున్న నమ్మకం వృధా పోదు. 'ఎడారిలో చిత్రీకరించిన దృశ్యాలు, విమానం కూలిన దృశ్యాన్ని, కన్న తల్లి దండ్రులకోసం పరితపించే పసిబాలుని దీనగాథ' ప్రేక్షకుల్ని అమితంగా ఆకర్షిస్తాయి.

'పాపం పసివాడు' చిత్రంలో నాగేష్ పైలెట్‌గాను, రాజబాబు జర్నలిస్టుగాను నటించారు. ఆగర్భశ్రీమంతులుగా ఎస్వీరంగారావు, దేవిక, వాళ్ళ ఏకైక వారసుడు, విధి వంచితుడుగా మాస్టర్



రాము నటించారు. దుష్ట్రత్రయంగా సూర్యకాంతం, ఛాయాదేవి సత్యనారాయణ కనిపిస్తారు. ఈ చిత్రానికి గొల్లపూడి రచనను, సత్యం సంగీతాన్ని, కన్నప్ప ఛాయను, కృష్ణారావు కళను నిర్వహించారు. ఏ. పూర్ణచంద్రరావు నిర్వహణలో నిర్మితమైన యీ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు. లక్ష్మి విడుదల.

## జనవరి ఆరున దేవుడమ్మ

శ్రీ రమణ చిత్ర యింటర్నేషనల్ తయారు చేస్తున్న 'దేవుడమ్మ' జనవరి 6 న శ్రీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది. చలం ముఖ్యపాత్రను పోషించే యీ చిత్రానికి రాజశ్రీ రచయిత, కె. వి. నందనరావు దర్శకుడు. నాయికగా జయలలిత నటిస్తున్న 'దేవుడమ్మ'లో చలం చెల్లెలిగా లక్ష్మి కనిపిస్తుంది.

## సాతనూరులో చంద్రకళ

రామవిజేతవారి 'రామరాజ్యం' షూటింగు సెప్టెంబర్ 5 నుండి 7 వరకు సాతనూరులో జరిగింది. చంద్రకళ, కొత్తనటుడు శరత్ పాల్గొన్న

# సినిమా

యుగళగీతాన్ని దర్శకుడు కె. బాబురావు చిత్రీకరించారు.

కవి నారాయణరెడ్డి వ్రాసి, ఘంటసాల సంగీతం సమకూర్చి, సుశీల— బాలసుబ్రమణ్యం పాడిన ఆ పాట ఎలా ప్రారంభమవుతుందో తెలుసా?

'ఏమండీ లేత బుగ్గల లాయరుగారూ' అంటూ చంద్రకళ, శరత్‌బాబును ఏడిపిస్తుంది.

## జగ్గయ్య—సావిత్రి

'రామరాజ్యం' చిత్రానికి భమిడిపాటి మాటలను, బుల్‌బులే ఛాయను, ఘంటసాల సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రంలో జగ్గయ్య, సావిత్రి దంపతులుగా నటిస్తున్నారు. జగ్గయ్య మిత్రుడిగా గుమ్మడి, తమ్ముడిగా శరత్, కుమార్తెగా రోజారమణి కనిపిస్తారు. సహాయపాత్రలను చంద్రమోహన్, రాజబాబు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, లకనం పోషిస్తున్నారు.

ఇటీవల కర్నగం స్టుడియోలో పతాక సన్నివేశాల చిత్రీకరణ జరిగింది. ఇంతవరకు రెండు పాటలు పిక్చరైజ్ అయినాయి. కె. ఏ. ప్రభాకర్ నిర్మిస్తున్న నాలుగవ చిత్రం యిది. లక్ష్మి విడదల.

# మీకు తెలుసా?

'పంజరంలో పసిపాప' చిత్రంలో గంగిరెద్దు, కోతి, కుక్క ప్రధాన తారాగణం....

అతామంగేష్కర్ మున్ముందు కిశోర్ కుమార్‌తో కలిసి పాడదట.

ప్రముఖగాయకుడు ఘంటసాల అస్వస్థత కారణంగా వేలూరు ఆసుపత్రిలో వున్నారట.

'పండంటి కాపురం' 24 కేంద్రాల్లో అర్ధశతదినోత్సవం జరుపుకుంది.

ముంతాజ్, జితేంద్రల పెండ్లి యిప్పట్లో జరిగేట్టు లేదు.

వాసంతి నిర్మించే చిత్రంలో ప్రమీల అనే కొత్తనటి పరిచయం అవుతుంది.

## గంగాధరరావు తమిళ చిత్రం

నవశక్తి అధినేత గంగాధరరావు యింతవరకు తెలుగు, హిందీ చిత్రాలను మాత్రమే నిర్మించి యున్నారు. సెప్టెంబర్ 7 న తమిళరంగాన్ని కూడా ప్రవేశించారు.

హిందీలో విజయఢంకా మ్రోగించిన ఒక కథను ఎన్నుకుని, తమిళ నిర్మాణం ప్రారంభించారు. ఈ చిత్రంలో తమిళనాడు ముఖ్యమంత్రి తనయుడు ము. క. ముత్తు కథానాయకుడిపాత్రను, మంజుల నాయిక పాత్రను పోషిస్తున్నారు. సహాయ భూమికలను ఎస్వీరంగారావు, ఏ. వి. ఎమ్. రాజన్, సుందరరాజన్, జయభారతి, ఎస్. ఎన్. లక్ష్మి ధరిస్తారు. తిరుమలై, మహాలింగం దర్శకత్వాన్ని అమృతం ఛాయను నిర్వహిస్తారు.

## బంగారు బాబులో శివాజీగణేశన్

జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మిస్తున్న 'బంగారు బాబు' చిత్రం అయిదవ షెడ్యూలు నందుకుంది. ఆరు పాటలు, ఫైట్లు, ముఖ్య సన్నివేశాలు చిత్రీకరించబడినాయి.

ఇటీవల నా మిత్రుడు ఏడు రీళ్ల రషస్‌వి చూశాడు. అతడు 'బంగారు బాబు'పై చేసిన కామెంటును మీకు తెలియచేస్తున్నాను. 'ఇట్ యీజ్ సింప్లీ వండర్‌ఫుల్. ఏడు రీళ్ళు చూస్తుంటే ఒక్క రీలు చూసినంత వేగం కనిపించింది. పాటలన్నీ చాలా బావున్నాయి' అన్నారు.

ప్రేక్షకుల మనస్సుకు నచ్చే కథలనే వి. బి.



'పద్మశ్రీపిక్చర్స్'లో అక్కినేని—వాణిశ్రీ.

## సినిమా

రాజేంద్ర ప్రసాద్ ఎన్నుకుంటారు. అందుకే ఆయన నిర్మించిన చిత్రాలన్నీ పాపులారిటీని సంపాయించాయి.

'బంగారుబాబు'లో శివాజీగణేశన్, జగ్గయ్య గెస్టుగా కనిపిస్తారు. వీరిద్దరితోబాటు ఎస్వీరంగారావు, గుమ్మడి, పద్మనాభం, రమణారెడ్డి కూడా అతిథి వేషాల్లో అగుపిస్తారు. వి. బి. రాజేంద్ర ప్రసాద్ దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయారయ్యే 'బంగారు బాబు'ను పొంగల్ పర్వదినాన మీరు చూస్తారు. నాగేశ్వరరావు, వాణిశ్రీ, జయంతి నాగభూషణం, రాజబాబు రమాప్రభ ప్రధాన పాత్రధారులు. అన్నపూర్ణా విడుదల.



'అజన్మ బ్రహ్మచారి'లో రాజసులోచన.

## విజయనిర్మల ద్విపాత్రాభినయం

ఎస్. వి. ఎస్. పిక్చర్స్ వారి 'చల్లని తల్లి' చిత్రంలో విజయనిర్మల ద్విపాత్రాభినయం చేస్తోంది. కృష్ణ, రామమోహన్ సరసన నటిస్తోంది. నిర్మాత: మిద్దె జగన్నాధరావు., దర్శకుడు. డి. యోగానంద్., విడుదల. తారకరామ.

—శ్రీనివాస్ ●

# మాంసకృత్తుల లోపం వలన జుట్టు ఊడుటకు దారి తీస్తుంది



## ప్యూర్ సిల్వీక్రిన్ 17 అత్యవసరమైన మాంస కృత్తుల అనుబంధములు కలిగియున్నది...జుట్టు మొదళ్ళకు అత్యవసర పోషణ కలుగజేసి జుట్టు ఊడిపోకుండ సహాయపడునని నోబుల్ ప్రైజ్ టెక్నిక్ చే నిరూపించబడినది





ప్యూర్ సిల్వీక్రిన్ ఊడిపోయేజుట్టును అరికట్టుటకు నిరూపణ.

1. జుట్టు మొదళ్ళలో ప్రధానమైన ఎమినో-ఏసిడ్ ల కొరత వలన జుట్టు పెరుగుదల బలహీనపడి, అనారోగ్యవంతముగా ఉండును. ఈ పరిస్థితి అరికట్టక పోతే, జుట్టు బలహీనపడి, ఊడిపోవుటకు దారి తీయగలదు.

2. ప్యూర్ సిల్వీక్రిన్ (మేగ్నిఫైడ్) ప్రతిబింబము 17 ఎమినో-ఏసిడ్ ల రూపంలో ప్రకృతి సిద్ధమైన మాంస కృత్తులు గలిగి అత్యవసర, ఆరోగ్యమైన జుట్టు పెరుగుదలకు ఉపకరిస్తుంది. ప్యూర్ సిల్వీక్రిన్ త్వరితంగా జుట్టు మొదళ్ళలోనికి చొచ్చుకొనిపోవును.

3. నోబుల్ బహుమతి విజయ పరిశోధన వలన ప్యూర్ సిల్వీక్రిన్ లోపించిన మాంస కృత్తులను భర్తీ చేసి మరల మీ జుట్టు దట్టంగా పెంచి, ఆరోగ్యకరంగా వుంచునట్లు చేస్తుంది.

**నేడే ప్యూర్ సిల్వీక్రిన్ వాడుటకు ఆరంభించండి:**

మంచి ఫలితాన్ని పొందటానికి ప్యూర్ సిల్వీక్రిన్ క్రమంగా వాడండి. ప్యూర్ సిల్వీక్రిన్ ప్రతిరోజూ రోజుకు రెండుసార్లు తలకు మర్దించండి, మీ జుట్టు పెరుగుట ఆరోగ్యవంతముగా వుండుట కనుగొనగలరు. కొద్ది కాలంలోనే, విచిత్రమైన ప్యూర్ సిల్వీక్రిన్ వాడకం మీ జుట్టు ఇదివరకటి ఆరోగ్యాన్ని చేకూర్చి దట్టంగా పెరుగుదల నిస్తుంది.




## ప్యూర్ సిల్వీక్రిన్ వాడుట ఆరంభించండి

mcm/s/7 tl

# విద్యార్థి

## తేజోవతి



### జరిగిన కథ

తల్లికి ఇష్టంలేకపోయినా ఎం. ఎ. లో చేరాడు విద్యార్థి. తన అన్నకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని ఆమె ఉద్దేశ్యం. కాని, లక్ష్మి ఎవరినో ప్రేమిస్తున్నట్లు తెలుసుకున్న విద్యార్థి, మేనమామతో వాదం పెంచుకుని తిరిగి వచ్చేస్తాడు. మెడిసిన్ చదువుతున్న శరత్ అతని రూమ్మేటు. అతని ద్వారానే సుందరి పరిచయమవుతుంది విద్యార్థికి. మామయ్య అప్పు తీర్చేటప్పటికి బాంకులో డబ్బు అయిపోయింది. ఇక ముందు చదువుగతి ఏమిటని విచారంలో మునిగిపోతాడు విద్యార్థి. గదిలో జరిగిన దొంగతనంవలన వేరే గది తీసుకుంటాడు. సత్యం కథ అతన్ని పొదుపరిగా మారుస్తుంది. ప్రైవేటుగా ఎం. ఏ. చదివే జ్ఞానాంబతో అతని పరిచయం పెరుగుతుంది. లక్ష్మి మోసపోయిందని తెలుస్తుంది. జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. అందుకే చనువు పెంచుకోసాగాడు. జ్ఞానాంబ ఆశయం విన్న విద్యార్థి ఆశ్చర్యపోయాడు. జ్ఞానాంబ మాటలలో విద్యార్థికి ధైర్యం వచ్చింది. లక్ష్మి తన కథంతా చెప్పింది జ్ఞానాంబతో

## 13

నిశ్చేష్టురాలయి వింటున్న జ్ఞానాంబ కళ్ళల్లో కూడా నీళ్ళు సుళ్ళు తిరిగినయి. ఆ మాటలు భరించ లేనిదానిలా, 'జయ లక్ష్మి గారూ!...' అంటూ వచ్చి లక్ష్మిని తన రెండు చేతుల్లోకి తీసుకుంది అభయ మిస్తున్న దానిలా ... ఎంత ఆపుకుందా మన్నా ఆగకుండా రెండు కన్నీటి చుక్కలు రాలిపడ్డయి...

రెండే రెండు నిముషాలు...

తెలివి వచ్చినట్లు చేతులు రెండూ విడిపించుకుని పక్కగా జరిగి నిలబడింది లక్ష్మి కొంగొత్తుకుంటూ ... కొనగోటితో కన్నీరు తుడుచుకుంటోంది జ్ఞానాంబ ...

'ఇహ పోదాం లక్ష్మి ...' అన్నాడు విద్యార్థి ఆ గంభీరతను తట్టుకోలేక...

ప్రశ్నార్థకంగా చూచింది లక్ష్మి జ్ఞానాంబ వైపు...

'ఎక్కడికి పోతారండీ...లక్ష్మిగారు యిక ఎక్కడికీ రారు...' అంది జ్ఞానాంబ.

'నిజంగా వుండిపొమ్మంటారా జ్ఞానాంబ గారూ ... సామాను తెచ్చేసుకోమంటారా యీ రాత్రికే?...' అదేదో అపురూప వరం పొందినట్లు క్రొత్త వుత్సాహంతో అంది లక్ష్మి...

'సరేలే...లేడికి లేచిందే పరుగుట ... అమ్మా...తల్లీ...నీకు పుణ్యముంటుంది... ఈ బ్రాడీపేటా అరండల్‌పేటల చుట్టూ తిరిగి నీ సామాను చేరెయ్యలేను గానీ ... రేపొద్దున పెట్టుకో ముహూర్తం ...' అన్నాడు నవ్వుతూ విద్యార్థి...

ఆ మాటలతో గంభీరంగావున్న వాతావరణం కాస్త తేలిక పడ్డట్లయింది.

'ఏం మీరు రాకపోతే మాకు భయమను కున్నారా?...పదండి లక్ష్మి గారూ నా సామానూ, మీ సామానూ మనమే చేరేసు కుందాం...' అంది జ్ఞానాంబ...

వద్దులెండి ... ఈ రాత్రికి సామాను సర్దేస్తాను. రేపు వుదయాన్నే యిక్కడికి వస్తే, యిక్కడినుండీ యిద్దరం కలిసి సామానంతా చేరెయ్యొచ్చు' అంది లక్ష్మి...

'హోహో యికనుండీ మీరిద్దరూ చేరి నన్ను వెలేస్తారు కాబోలు...' అన్నాడు విద్యార్థి నవ్వుతూ...

'ఇంతదాకా మంచితనం మిగిలివున్న వాడు మా బావ ఒక్కడే అనుకున్నాను ... చాలా చాలా థాంక్స్ జ్ఞానాంబగారూ ... మీ మేలు మర్చిపోలేను...' అంది లక్ష్మి కృతజ్ఞతా పూర్వకంగా...

'లక్ష్మిగారూ...నా గదికి వొచ్చేముందు ఒక కండిషన్...మీరు 'యీ మేలు మర్చి పోవడం...ఋణపడి వుండడం, వగైరా మాటల్నీ, గతాన్నీ పూర్తిగా మర్చిపోయి రండి...మిమ్మల్ని మీరు కించపర్చుకోడం, నన్నేదో ఆకాశానికి ఎత్తివేయడం లాంటిది నాకసలు పనికిరావు...మరి మీ యిష్టం...' అంది జ్ఞానాంబ నవ్వుతూనే...

జ్ఞానాంబ చేతిని తన చేతిలోకి తీసుకుని స్నేహపూర్వకంగా ఒకసారి నొక్కివదిలేసి, 'వస్తాను' అంటూ సెలవు తీసుకుంది లక్ష్మి...

ఆ తర్వాత లక్ష్మిని రిక్షా ఎక్కించి పంపించి తను హోటల్లో భోంచేసి గదికి చేరాడు విద్యార్థి....

మర్నాడుదయం హోటల్లో చిన్ననాటి మిత్రుడొకడు కలిశాడు ... తాడికొండలో స్కౌట్ ట్రెయినింగ్ కాంప్ జరుగుతుంటే మాడ్డానికి వెళ్తూ విద్యార్థినికూడా పిలిచాడు...విద్యార్థి చిన్నప్పటినుండీ స్కౌట్‌లో వున్నవాడు ... రోవర్ ఫస్ట్‌క్లాస్ కూడా పాసయ్యాడు ... శమఫోర్, సిగ్నలింగ్‌లో తనకు దీటైనవాడు లేడనిపించుకున్నాడు.. కాలేజిలో చదువుకునేప్పుడుకూడా, మంగళగిరి, కోటప్పకొండ తిరునాళ్ళకు 'సర్వీస్' చెయ్యడానికి వెళ్తుండేవాడు...ఒకటి రెండు సార్లు అసిస్టెంట్ కాంప్ చీఫ్‌గాకూడాచేసి పెద్దలచేత భళీ అనిపించుకున్నాడు ... ఎన్. సి. సి. వచ్చాక 'స్కౌటు మూమెంట్' మీద చాలామందికి మోజు తగ్గినా విద్యార్థికి మాత్రం స్కౌటింగ్ అంటేనే అభిమానం. మానవసేవ చెయ్యాలంటే స్కౌటుగానే ఎక్కువ అవకాశం వుంటుందని స్నేహితులతో వాదించే వాడు...

'అరేయ్! ఎక్కడన్నా పందిరి బొంగులు కన్పిస్తే చాలు...అది పెళ్లి పందిరి బాబోయ్... అన్నా వినకుండా 'స్కార్ఫ్' కట్టుకొని, క్రరపట్టుకుని

బయలుదేరుతారు మీ స్కౌట్స్; సర్వీస్ అంటూ' అని స్నేహితులు గేలిచేసినా విద్యార్థి పట్టించుకునేవాడుకాడు...అటువంటిది అంత దగ్గర్లో స్కౌటుకాంప్ జరుగుతోందంటే...అందునా తనకు తెలిసినవాడు కాంప్ కండక్ట్ చేస్తూంటే వెళ్ళకుండా వుండగలడా?...

'ఇదుగో లేస్పొద్దున్నవచ్చి సామాను చేరెయ్యడానికి సహాయం చేస్తా'నని లక్ష్మితో చెప్పినవాడు అన్నీ మర్చిపోయి, స్నేహితుడు చెప్పగానే అటునుండి అటే తాడికొండ వెళ్లే బస్సెక్కాడు...

తీరా అక్కడికెళ్ళాక 'శమ స్టో రీ' క్లాసులు తీసుకోందే కదలడానికి వీల్లేదన్నాడు అక్కడి ఎ.డి.సి.సి.ఎ.ఎస్.ఒ.సి. వూరికి దూరంగా విశాలమైన మర్రి చెట్టునీడలో, అందంగా క్రీడాపర్వతంలా వున్న కొండపక్క నిర్వహింపబడుతున్న ఆ కాంప్ యేరియా వొదిలి అతను సొమ్మన్నా వచ్చేవాడు కాడేమో విద్యార్థి!... ఆ రాత్రి అక్కడే భోజనంచేసి, ఆఖరి బస్సుకు బయలుదేరి గుంటూరు పొలిమేరల్లోకివచ్చాక అప్పుడు జ్ఞాపకంవచ్చింది తను యిల్లు వెతకాలన్న విషయం. మర్నాడు ప్రొద్దున్నే కాఫీ గొంతులో పోసుకుని, యింటివేట మొదలెట్టి, తిరిగి తిరిగి లాభంలేక కాలేజికి వెళ్ళిపొయ్యాడు. మళ్ళీ వచ్చేటప్పుడు దోవలో జ్ఞానాంబ కన్పిస్తే తనలో వాళ్ళ కొత్త యింటికి వెళ్ళాడు...ఆక్రితం రోజు జ్ఞానాంబ సెలవుపెట్టింది. గంటలో యిద్దరి సామాన్లూ చేర్చడం పూర్తయింది. అప్పుడే గది శుభ్రంగా సర్దడం కూడా అయిపోయింది. గది పెద్దదే కాకుండా దానికి ముందు చిన్నపంచ...పంచ ముందు చిన్న పిట్టగోడ...ఇంటి వాళ్ళతో సంబంధం లేకుండా పక్కవాకిలిగుండా నడవచ్చు ... ఇల్లు ముచ్చటగా - వుండనుకున్నాడు విద్యార్థి...

కుర్చీతెచ్చి పంచలో వేసింది జ్ఞానాంబ. లక్ష్మికూడా వచ్చి పలుకరించింది... లక్ష్మికి ఆశ్రయం దొరికిందని కొంత సంతోషం కలిగినా, అతడి అంతరాంతరాలలో కొంత బాధనిపించింది. జ్ఞానాంబను తన తోడు నీడగా చేసుకోవాలనుకున్న రోజునే తనకు మనోకర్ని తోడు చెప్పిపెట్టాడు తను...

ఇక తనతో మాట కలిపే దెపుడు?... మనసు తెలిపేదెప్పుడు?...అన్నీ యిలాంటి లోనితోచని పన్లేచేస్తానని...లోలోన తనని తనే విసుక్కున్నాడు కూడా...

కాస్సేపయ్యాక 'యిప్పుడేవస్తా'నంటూ లోపలికి వెళ్ళిన లక్ష్మిని చూసి, తనభావం పసికట్టలేదుకదా...అనుకున్నాడు ... కాసేపట్లో కాఫీ తెచ్చియిచ్చి మళ్ళీ వెళ్ళిపోయింది లక్ష్మి... మనసులోనే ధన్యవాదాలర్పించుకున్నాడు విద్యార్థి ... ఆ తర్వాత యిద్దరూ చీకటిపడేదాకా 'హామ్లెట్'మీద 'డోవర్ విల్సన్' క్రిటిసిజంమీద చర్చించుకుంటూ కూర్చున్నారు పంచలో. లక్ష్మి మాత్రం గదిలోనే కూర్చుని చదువుకుంది.

ఆ మర్నాడు ప్రొద్దుట యింటికోసం తిరిగి తిరిగి విసుగెత్తి కాలేజికి వెళ్ళిపొయ్యాడు. అతడు తిరిగివచ్చేసరికి తల్లి అక్కావాళ్లూ వచ్చివున్నారు. గది వేసి వుండడంవల్ల యింటి వాళ్ళింట్లో కూర్చున్నారు. వాళ్ళను చూడగానే విద్యార్థి గుండె గుభేలుమంది...అయితే తలుపుతీసి తియ్యగానే చల్లనిమాట చెవినవేసింది దనమ్మగారు. పురుడయి వాళ్ళు వెళ్ళే దాకా ఆ పక్క గదికూడా తీసుకోమన్నారుట యింటివాళ్ళు... పెద్ద బరువుదించినట్టయింది విద్యార్థికి.



కాని అక్కావాళ్ళు రావడంతో చదువు మూలపడింది...అక్కను డాక్టరుకు చూపించాడు. వాళ్ళు ప్రసవం ముందు కొన్నాళ్ళు ఆస్పత్రిలో వుండమనడంతో యింటికి కావల్సిన వస్తువులు తేవడం, ఆస్పత్రికి కాఫీ భోజనం అవీ తీసుకెళ్ళడం వీటితో సరిపోతోంది...కాలేజికికూడా రెగ్యులర్గా వెళ్ళలేకపోతున్నాడు... అక్కకు

సిజేరియన్ ఆపరేషను చేసి బిడ్డను తియ్యాల్సివచ్చింది. టెలిగ్రాము యిచ్చి బావగార్ని పిలిపించారు. ఆయనా వాళ్ళమ్మ గారూ వచ్చారన్నమాటేగానీ విద్యార్థికి మాత్రం పుస్తకం పట్టడానికికూడా వీలు చిక్కలేదు. తల్లి ఏపని చెప్పినా, 'అయ్యో! ...మా బావమరిదిగారు పోస్టుగ్రాడ్యు యేటులలంటీ... ఆయనకు పనిచెబ్తారేం?' అని వెటకారంచేసే బావగారు, ఒక్కరోజు కూడా హాస్పిటలుకు కాఫీ తీసుకెళ్ళలేదు... ఆ పదిరోజులు అయిపోయినా, అక్కకు వొంట్లో స్వస్థత చేకూరనందున మరో పదిరోజులపాటు ఆస్పత్రిలోనే వుంచాల్సి వచ్చింది.

మార్చి నెల వెళ్ళి ఏప్రిల్ కూడా వచ్చింది ... కాలేజికి ప్రిపరేషన్ హాలిడేస్ యిచ్చారు. పిల్లవాడికి ఇరవై ఒక్క రోజులు రాగానే, బావగారూ వాళ్ళమ్మా వెళ్ళి పోయ్యారు. విద్యార్థి కాస్త వూపిరి పీల్చు కున్నాడు ... కానీ పగలంతా యింట్లో గొడవ...పసిపిల్లవాడి ఏడుపు ...మధ్యాహ్నం మైతే యిరుగు పొరుగునందర్నీ యింట్లో సమావేశ పరిచి కబుర్లు పెట్టుకునేది ధనమ్మగారు...

విద్యార్థికి విసుగేసింది...అతడికి తన చదువు గట్టెక్కలేనేమో ననిపిస్తోంది. ఒక్కోసారి నీరసం నిస్పృహ ముంచు కొచ్చి ఆ పుస్తకాలన్నీ కట్టగట్టి అవతల పారెయ్యాలనిపిస్తోంది. దానికితోడు ఆర్థిక పరిస్థితులు. ధనమ్మగారిది పెద్ద చెయ్యి.

# విద్యార్థి

ఆవిడ ఖర్చు ఒకటికి పదింతలు పెడు తుంది ... అందులో కూతురు పురుడు ఘనంగా పొయ్యాలనుకున్నారావిడ...హాస్పి టలు ఖర్చులు మందులు మాకులు ... చుట్టాలు పక్కాలు రాక ... వీటన్నిటితో బాంకిలో వేసిన మొత్తం అంతా అయిపో వచ్చింది...అంటే ఆ ఏడు మొత్తానికి సరిపోవాల్సిన డబ్బు...వచ్చే ఏడు నాట్లకే చేతిలో డబ్బుల్లేకుండా అయిపోయినయి. ఇక రెండో సంవత్సరం చదువు సాగడ మనే మాట కల్ల అనిపించిందింది విద్యా ర్థికి...వచ్చే ఏడు చదువు సాగదనీ తెలిసి, యీ సంవత్సరం పరీక్ష పాసవుతాననే నమ్మకంకూడా లేకుండా యింకా ఎందుకీ చదువు కొనసాగించడం ... వీలుంటే ఆ తర్వాతెప్పుడన్నా చూసుకోవచ్చులే ... అని పించింది విద్యార్థికి...

కానీ జ్ఞానాంబమాత్రం పరీక్షలు తప్పక రాయమని ప్రోత్సహించింది. 'పాసవుతానని నమ్మకంలేనప్పుడు పరీక్ష లెందుకండీ రాయడం?' అంటే 'బాగుంది! అన్నం జీర్ణం అవుతుందో కాదోనని అన్నం మానే స్తారా?... ఏ అడ్డంకులు, అవాంతరాలూ రాకుండా, నల్లేరుమీద బండి నడకలా సాగి పోతే యిక మనం సాధించిన గొప్పేముంది! ...ఏదైనా సరే కష్టతమమైంది సాధించ డంలోనే గొప్పవుంది.' అంటూ ప్రోత్సాహ మిచ్చేది...ఇప్పుడతడికి జ్ఞానాంబ సాన్నిధ్యం లోనే ఎంతో ధైర్యంగా వుంటోంది...రోజూ సాయంత్రం వాళ్ళ యింటికి వెళ్ళటం... రాత్రి పదిగంటలుదాకా అక్కడే కలిసి చద వడం, ఆ తర్వాత యింటికొచ్చి భోజనం చేసి, పుస్తకం తియ్యడం. ఇప్పుడతడికి చదువుకంటే ముఖ్యంగా జ్ఞానాంబను చూడందే, తనతో మాట్లాడందే వుండలేక పోతున్నాడు...లక్ష్మికికూడా పరీక్షలు ... జ్ఞానాంబ లక్ష్మి యిద్దరూ కూడా ఈడు పరీక్షలు రాయాల్సిందేనని పట్టు బట్టారు.

ఒది మేనెల...సాయంసమయిం...అప్పటి దాకా నిప్పులు చెరిగిన సూర్యభగవానుడు అలసినట్లు పడమటికొండల పడకటింటికి చేరుకుంటున్నాడు. అతడు చెరిగిపోయిన నిప్పుల తాలూకు వేడి యింకా పూర్తిగా తగ్గలేదు. అప్పటికి పరీక్షలు వారంరోజులే వున్నయి. విద్యార్థి లుంగీబనీనుతో బయట వేపచెట్టుకింద చదువుకుంటున్నాడు...ఒక చేతిలో పుస్తకం...ఒక చేతిలో మేనల్లుడు ...అప్పుడే మూడవనెలవచ్చిన ఆ పసివాడు యింకా సరిగా మెడ నిలవలేకపోతున్నాడు... అయితేనేం మేనమామచేతిలో వున్న పుస్తకం అందుకోవడానికి నానా తంటాలూపడు తున్న అల్లుడికి దూరంగా పుస్తకం పట్టు కొని చదువుకుంటున్నాడు విద్యార్థి... అప్పుడేవచ్చాడు సత్యం.

'ఏమిట్రా అల్లుడితో కుస్తీ పడు తున్నావ్?' అంటూ.

'చూడరా నా చదువుకు వీడూ ఒక 'విలన్' అయ్యాడు. పుస్తకం పట్టు కుంటే చాలు; వీడి సొమ్మంతాపోయినట్లు కేకలుపెడ్తాడు. ఎత్తుకుంటే యిదీవరస ...కేరింతాలు కొడుతూ ...' అల్లుడిమీద ఫిర్యాదుచేశాడు నవ్వుతూ.

'అయితే ఈ 'విలన్‌గాడు' నీ భుజం మీదెక్కి స్వారీకూడా చేస్తున్నాడే?', పచ్చగా గుమ్మడిపండులావున్న బాబు బుగ్గలు పుణకుతూ అన్నాడు సత్యం.

'వీడు మా గొప్ప విలన్‌లే ... భుజా లేమిటి?... జుట్టుపట్టుకునే గుంజుతాడు' అంటూ గులాబీ రేకుల్లా మెత్తగావున్న చేతుల్తో మామయ్య జుట్టుపట్టుకున్న అల్లుడి చేతిలో జుట్టు విడిపించుకుంటూ అన్నాడు విద్యార్థి... 'మీ చదువెలా సాగు తోందిరా?' అని.



'ఫరవాలేదురా ... ట్యూషను పిల్లలకు మార్చిలో పరీక్ష లయిపోయినప్పటినుండీ నాకు తీరికగానే వుంది' అని చెప్పాడు సత్యం.

విద్యార్థి లోకన్‌వైపు తిరిగి నవ్వుతూ, 'మీ చదువు?' అన్నాడు. లోకన్ రోజూ ఉదయం సాయంత్రం లెక్చరర్స్ యింటికి వెళ్ళి వస్తున్నాడని క్లాస్‌మేట్స్ అందరూ 'కాక్స్' అంటూ గొడవ చేస్తున్న విషయం విద్యార్థికి తెలుసు. అందుకే నవ్వాడు. అది గ్రహించిన లోకన్‌బాబు, 'ఏదో చదువుతున్నాను లెండి గురుగారూ. చదవకపోతే ఎట్లా? ... అసలు గురూగారూ... ఈ లోకం వుంది చూశారూ... వీళ్ళకు తాము బాగుపడడం చేతకాదు ... ఒకరు బాగుపడితే చూసి ఓర్చుకోడం చేతకాదు. మనమేం చేస్తాం' అన్నాడు.

'ఈమధ్య అసలు కన్పట్టమే లేదేమిరా?' అని అడిగాడు సత్యం.

'గురూగారు జ్ఞానమార్గంలోపడ్డారులే. యిక మనమేం కన్పిస్తాం' అన్నాడు లోకన్ భావగర్భితంగా...

'ఏమార్గమైనా ఫర్వాలేదు... ఎటొచ్చీ దారి తప్పకుండావుంటే' అన్నాడు సత్యం.

వాళ్ళు జ్ఞానాంబ నుద్దేశించే అంటున్నారని గ్రహించి, మాటమారుస్తూ,

'నా చదువే సాగటంలేదురా... పరీక్షలు మానేద్దామా అంటే జ్ఞానాంబగారూ వాళ్ళూ రాయమని బలవంతం చేస్తున్నారు' అ్నడు విద్యార్థి...

'పరీక్షలు మానడమెందుకురా... అయితే అవుతుంది ... లేకపోతే లేదు ... అంతేగాని యింతదూరం కష్టపడి పరీక్షకు మానడమేమిటి? ... ఇక వస్తాం... నువ్వు బాగా చదువు' అని చెప్పి వెళ్ళిపొయ్యారు వాళ్ళిద్దరూ...

వాళ్ళు వెళ్ళిపొయ్యాక ఆలోచనలో పడ్డాడు విద్యార్థి ... వచ్చే సంవత్సరం చదువుమాట అలా వుంచి, మళ్ళీ పంటలొచ్చేదాకా పొలంలో పారదమ్మ్మ, నాట్లు, ఎరువులు, కోతలూ యివన్నీ ఏం చేసేట్లు?...ఇంటి ఖర్చుకి ఎలా? ... ఇక బాంకిలో వున్నది రెండుమూడొందలూ ... అదయినా వుంచుదామంటే అమ్మ బాలసారెకు పిల్లాడికి మురుగులు చేయించాలన్నది...కానీ విద్యార్థి యేమీ మాట్లాడలేదు... కానీ యిప్పుడనిపిస్తోందతడికి ఆ రెండొందలూ ఏం చాలుతయి గనుక అని...

విద్యార్థి ఆలోచనల్లోవుంటే పసివాడు కేరింతాలు కొడుతూ మేనమామ ముఖం మీద తపతపా కొడుతున్నాడు ... విద్యార్థి అల్లుడి ఉత్సాహం చూసి వాడి అమాయకపు బోసినవ్వుచూసి, వాడి చిన్ని చిన్ని చేతులు తీసి ముద్దుపెట్టుకుంటూ, 'వెధవన్నా ఈ మామయ్యే నీ చేతికి మురుగులొద్దన్నాడని నీకేం తెలుసు? ... లేదులే నాన్నా ... అయ్యే ఖర్చులు అవుతుండగా, నీదగ్గర కొచ్చేటప్పటికి వెనుకాడ్డమెందుకు? ... ఒకవంద ఎలాగో బాలసారె ఖర్చులకు కావాలి ... మిగతాదిపెట్టి నీ

## విద్యార్థి

బుజ్జిబుజ్జి చేతులకు మురుగులు చేయిస్తాలే. ఆ ఒక్కవందా పెట్టి నేనేం చదువుతానూ ...' అనుకున్నాడు మనస్సులో విద్యార్థి ... ఆ నిర్ణయానికి రాగానే అతడి మనసు తేలికపడ్డట్టయింది ...మళ్ళీ లేత తమలపాకుల్లావున్న పసివాడిచేతులు ముద్దుపెట్టుకుంటుండగా.

'ఏమిటండోయ్ !... అల్లుడితో మురిపాలువడుతున్నారు ?' అంటూన్న జ్ఞానాంబ గొంతు విని తలెత్తి చూశాడు.

ఆ అమ్మాయిని చూడగానే అతడికి ఎక్కడలేని సంతోషమూ వచ్చింది ... మళ్ళీ తనలో తనే ప్రశ్నించుకున్నాడు ? '... ఏమిటి యీ నల్లపిల్లలోవున్న ఆకర్షణ? ...అందరూ నిర్లక్ష్యంచేసే యీ పిల్ల సాహచర్యంలో తనకు అనిర్వచనీయమైన ఆనందం ఎందుకు కల్గుతుంది? ... ఈ అమ్మాయి, విరాగినిలావుండే యీ పిల్ల తనకు శాశ్వతసహచరి అయి తన జీవితానికి చుక్కానిపట్టడం జరుగుతుందా ?

ఆలోచనలను ఆవలకునెట్టి గేటు కవతల నిలబడివున్న జ్ఞానాంబను లక్ష్మిని పిలిచాడు 'లోపలకు రండి' అంటూ...

'అత్తయ్యవాళ్ళూలేరా ?' వెంటనే అడిగింది లక్ష్మి...

'ఉహుఁ...నేనూ వీడూ తప్ప యింకెవరూలేరు...ఫర్వాలేదు రండి' అన్నాడు.

'ఎల్లుండి వీడికి నామకరణం...అమ్మా వాళ్ళూ బజారుకెళ్ళారు.

'మీరేమో అల్లుడి మురిపాల్లో పరిసరాలు మర్చిపొయ్యారు ...' అంది జ్ఞానాంబ.

'ఎందుకైనా మంచిదని మాబావ మేనల్లుడికి కాకా పడుతున్నాడులే.' అంది లక్ష్మి నవ్వుతూ.

'మరే...అనుకున్న మేనరికాలన్నీ యింత చక్కగా అవుతున్నయికదూ... ఇక వీడికి కాకాపట్టాలి నేను !...' చఱ్ఱున జవాబిచ్చాడు విద్యార్థి.

లక్ష్మి ముఖం చిన్నబోయింది... మాట్లాడలేదు.

కాంతి తరిగిన లక్ష్మి ముఖం చూశాక అప్పుడు తట్టింది విద్యార్థికి ఆఅమ్మాయి మనసు గాయపర్చానేమోనని ... మాట మార్చడానికి వెంటనే...

'ఇంతకూ ఎక్కడినుండీ రాక?...ఎక్కడిదాకా పోక?...సెలవియ్యవేలేదు?' అన్నాడు.

'ఇద్దరూ అలా బజారుదాకా వెళ్తున్నాం' అంది లక్ష్మి.

'ఏయ్ బాబూ...'చేతులు చాపి పిల్చింది జ్ఞానాంబ బాబును...వాడు చేతుల్లోకి దూకకుండా మొహంలోకి చూస్తున్నాడు.

'మీ మేనల్లుడు హడలిపోయినట్లున్నాడండి. నన్నూ నారంగుని చూసి వీ పెద్దపులో సింహమో అనుకున్నట్లున్నాడు... బిక్కమొహంపెట్టాడు...' అందిజ్ఞానాంబ.

'చచాం...యిహ ఆనండి మీ జంతు

# అమ్మాయి పేరు "బంగ్లా గాంధీ" అని పెట్టామండి!!



శాస్త్రపరిజ్ఞానం... పెద్దపులులూ సింహాలూ వల్లగా వుండవండీ బాబూ...' బాబును అందిస్తూ నవ్వుతూ అన్నాడు విద్యార్థి.

'పోనీండి...పులికాకపోతే దెయ్యం ...' అన్నది జ్ఞానాంబ.

ఇంతలోకే పసివాడు రాగం సాగించేసరికి తిరిగి యిచ్చేస్తూ, 'చూశారా మీ అల్లుడికి నేను నచ్చలేదు' అంది జ్ఞానాంబ.

లక్ష్మి కళ్ళప్పగించి ఆ దృశ్యం చూస్తోందిగానీ, ఆమె వాళ్ళమాటలు పట్టించుకోలేదు ... మనసు ఏదో ఆలోచిస్తోంది...

బావ ఆశలు ఫలించి, జ్ఞానాంబను పొందగలిగితే, ఆవిడ బావకు యిలా గుమ్మడిపండులాంటి బాబును అందివ్వగలదా?...ఏమో బావపోలిక వస్తే? ... ఆ వూహ పోగానే మనసులో ఎక్కడో ముల్లు గుచ్చుకుని కలకబారి నట్లయింది లక్ష్మికి... ఈ బావ తనకు అందివచ్చినరోజు తను చేతులారా విసిరికొట్టింది... ఈరోజు ఈ మనసు ఎందుకిలా పాకులాడుతోంది? ... సమయం చూసి పాము పడగయెత్తినట్లు, యిన్నాళ్ళూ తన మనసులో ఏమూలో దాగివున్న ఈర్ష్యాసర్పం, సమయం చూసి పడగ విప్పుతోందా? ... తనకు తనే ప్రశ్నించుకుంది.

తనను తోడబుట్టిన తోడుకంటే ఎక్కువగా ఆదరించి ఆశ్రయమిచ్చిన జ్ఞానాంబ, తనను ఆదుకుని ఆశ్రయం చూపిన బావ ... హే భగవాన్! నా మనసు నా అధీనంలో వుండేలా చెయ్యి ... వీళ్ళిద్దరూ సుఖపడేలా చూడు ... మనసులోనే అర్థిస్తోంది లక్ష్మి...

'ఏమిటి లక్ష్మి తెగాలోచిస్తున్నావ్? ఈ అల్లుడ్ని నాకు కాకుండా ఎలా కొట్టేయాలా అనా?...' నవ్వుతూ అడిగాడు విద్యార్థి...

'కొట్టెయ్యడం మాట అటుంచు ... కనీసం ఎత్తుకోడానికన్నా తగుదునా అని ఆలోచిస్తున్నాను బావా...' అంది...

'లక్ష్మి!...ఇలా మాట్లాడవద్దని ఎన్ని సార్లు చెప్పాను నీకు?' మందలిస్తూ అన్నాడు...

'అది సరే ... నిజం చెప్పు బావా ... అత్తయ్యా వాళ్ళూ నన్ను గురించి ఏమన్నారు?... నా పేరు తలవడమే మహా పాపమన్నట్లు మాట్లాడలేదా? ... నిజం చెప్పు బావా...'

నిజానికి ధనమ్మగారు వచ్చిరాగానే ఆ విషయమే చెప్పింది కొడుక్కి. 'మనం అదృష్టవంతులంరా...నువ్వు దాన్ని వద్దనడమే సరిపోయింది...లేకుంటే అది మన పరువూ యిలాగే తీసేది ... కొంపలోంచి పోయిందిట...మంచి పనిసేసింది... అలాంటి కూతుళ్ళువుండేం చచ్చేం...'అన్నదావిడ....

విద్యార్థి జవాబు చెప్పలేదు ... కనీసం లక్ష్మి యిక్కడేవుందని చెప్పటం కూడా శ్రేయస్కరం కాదనిపించిందతడికి...

అందుకని టాపిక్ మారుస్తూ, 'లండి నిలబడేవున్నారు యింతసేపూ' అంటూ వాళ్ళ యింటిముందున్న వేపచెట్టు నీడన మంచం వాల్చి, తను పడక్కుర్చీ లో

# హెమరాయిడ్స్

## పి. రమేష్ నారాయణ

సాధారణంగా 'మూలశంక' అంటూ పిలువబడే ఈ వ్యాధిని ఆంగ్లంలో 'పైల్స్' అంటారు. ఉష్ణమండలవాసుల్లో సర్వసామాన్యమయిన ఈ వ్యాధి వ్యక్తిగతంగా ఆయా రోగులు అనుభవించే అతి సున్నితము, తీవ్రము అయిన బాధగ వైద్యులచే భావింపబడుతోంది.

ఇంతకూ ఈ హెమరాయిడ్స్‌కు కారణం పురీషనాళంలోపలగాని, వెలుపలగాని కొన్ని పరిస్థితుల దృష్ట్యా, ఉబ్బి, వ్యాకోచం చెందిన సిరలు. అంటే చెడు రక్తాన్ని మోసికొనిపోయే రక్తనాళాలు. పేగుల్లో కదలికలు సంభవించినపుడల్లా ఇవి వ్యాకోచిస్తూ వెడల్పు కావటంవల్ల రోగికి బాధ అధికమవుతుంది.

ఈ మూల వ్యాధి రెండు రకాలుగ ఉంటుంది. పేగులోపలి గోడల్లోని సిరనాళాలు ఉబ్బటం ద్వారా పురీషనాళం అంతర్గతంగా 'ఇంటర్నల్ పైల్స్' ఏర్పడతాయి. అలాగాక ఆసన ప్రాంతపు చర్మం ఉపరితలంపై కూడా ఇవి ఏర్పడవచ్చు. వీటిని 'ఎక్స్‌టర్నల్ పైల్స్' అంటారు. తొలి దశల్లోనే వ్యక్తులకు చాలా ఇబ్బందిని కలిగించే ఈ వ్యాధి లక్షణాలు— పేగు కదలికలు సంభవించినపుడు, మల విసర్జనం గావించినప్పుడు, అధికంగా రక్తస్రావము కల్గటము విపరీతమయిన బాధ, మంటతో కూడిన దురద ఇత్యాదులు.

డయేరియా, మలబద్ధకంవల్ల పైల్స్ వచ్చే అవకాశాలున్నాయి. గర్భవతులయిన స్త్రీలకు, ఎప్పుడు నిలిచిగాని, కూర్చొనిగాని ఉద్యోగాలు చేసేవారికి ఈ వ్యాధి సులభంగా వస్తుంది. దీని కారణం ఇలాంటి వ్యక్తుల్లోనే ఆసనప్రాంతంలోని చర్మంపైనా, ఆ యా భాగాల్లోని రక్తనాళాలపైనా ఒత్తిడి ఎక్కువగా ఉండటమేననవచ్చు. ఒక్కోసారి ఇవి వంశానుగతంగా కూడా రావచ్చు. ఇలాంటి కేసుల్లో వయసు మీరినవారేగాక పిల్లలు కూడా వీటిచే బాధ పడుతుంటారు.

హెమరాయిడ్స్‌ను బాగుగా పరీక్షించటానికి 'ఎనోస్కోప్' అన్న పరికరం తోడ్పడుతుంది. సర్జరీ విధానం ద్వారా ఈ వ్యాధి నివారణకు గావించే వైద్య చికిత్సను 'హెమరాయిడెక్టమి' అంటారు. ఇది గావించే ముందు మూలవ్యాధిగల రోగులను సిగ్మాయిడోస్కోప్‌తో పరీక్షిస్తారు. నలభై సంవత్సరాల వయసు మీరిన వ్యక్తులు ఈ వ్యాధి కలిగివుంటే వారికి బేరియం ఎనీమా ఇచ్చి చికిత్స కొనసాగిస్తారు. నులివెచ్చని వేడి నీటితో పైల్స్ గల చర్మ భాగాలను తడి చేయటంలాంటి 'సిట్జ్ బాత్' కూడా వైద్య చికిత్సలో ఒక భాగంగ ఉంటుంది.

సకాలంలో నివారణ పొందకపోయినచో పైల్స్‌వల్ల రోగులకు విపరీతమయిన బాధ కలగటమేగాక చాల అపాయకరంగా కూడా పరిణమిస్తాయి. ఒక్కోసారి అవి పగలటం వల్ల ఆ యా ప్రాంతాల్లోని కణజాలాలు, చర్మ భాగాలు తీవ్రంగా 'డామేజ్' అవుతాయి. తత్ఫలితంగా ఇవి కార్సినోమాలాంటి ఇతర వ్యాధులకు దారి తీయొచ్చు. విపరీతమయిన రక్తస్రావం కూడా కొన్ని పరిస్థితుల్లో సంభవించి వ్యక్తులలో రక్తహీనతను కలిగిస్తాయి.

ఈ మూలవ్యాధి నివారణకు ఆంగ్ల వైద్యంలో నిమిత్తం లేకనే అద్భుతములయిన ఫలితాలనిచ్చే మందులు హోమియోపతి, ఆయుర్వేద చికిత్సలలోనే ఉన్నాయి. ఈ వ్యాధి వున్న వ్యక్తులు సకాలంలో అనుభవజ్ఞుడయిన వైద్యుడిని సంప్రదించి సరతయిన సలహా, చికిత్స పొందటం చాల మంచిది.

# విద్యార్థి

కూర్చున్నాడు...పసివాడు లక్ష్మి ఒడిలో కూచుని ఆమె మెడలోని ఒంటిపేట గొలుసుతో ఆడుకుంటున్నాడు.

'ఇంతకూ రాత్రి పిక్చర్ ఎలావుంది?' అని అడిగాడు.

'రాత్రి వెళ్ళలేదు బావా.'

'అదేం?... 'హరిహర్'లో పిక్చరుంది ...చాలా బాగుందిట... వెళ్తున్నామంటూ నన్ను హడలగొట్టి తరిమేశారుగా నిన్న సాయంత్రం?'

'తీరా బయలుదేరుతుంటే జ్ఞానాంబ గారి వూరునుండీ ఎవరోవచ్చారు...దానితో కాన్సిల్ అయ్యింది.'

'ఈపూట వెళ్దామనుకుంటున్నాం...' అని చెప్పింది జ్ఞానాంబ.

'అయితే నన్ను కూడా రమ్మంటారా చదివి చదివి బోరుకొడ్తోంది.'

నవ్వుతూ అడిగాడు విద్యార్థి.

'అయ్యో తప్పకుండారా బావా... నిన్ననే రమ్మందామనుకోని... చదువు పాడవుతుందటావేమోనని వూరుకున్నాను.'

'జ్ఞానాంబగారికి అభ్యంతరమేమో?...'

'నాకెందుకండీ అభ్యంతరం?... మంచి వారే...రండి తప్పకుండా...అంది జ్ఞానాంబ 'కానీ... యింట్లో ఎవరూలేరు ... మీ అల్లుడ్ని ఏం చేసివస్తారు?' అంది.

'ఎందుకండీ...వాళ్ళు వెళ్ళి చాలా సేపయింది...ఓ పదినిముషాల్లోపలే వచ్చేస్తారు ...వాళ్ళు రాగానే నేను బయలుదేరుతాను ...మీరింకా గదికి వెళ్ళి తయారవాలిగా... ఈ లోపలే నేనూ వచ్చేస్తాను' అన్నాడు వుత్సాహంగా.

'అయితే మనం లేద్దాం జ్ఞానాంబ గారూ...' అంటూ లేచి బాబును ఆబుగ్గా యీ బుగ్గా ముద్దుకొని విద్యార్థి కిచ్చేసింది లక్ష్మి.

'వస్తామండీ' అంటూ లేచింది జ్ఞానాంబ కూడా.

'మీకోసం వెయిట్‌చేస్తుంటాం ...పదిహేను నిముషాల్లో వచ్చేయాలి.'

(ఇంకా ఉంది)

# వంటింట్లో మగవాడు!

కె. రామలక్ష్మి



'ఆవిడకి నోట్లో నాలుక లేదండీ' అంటూ నన్నుగురించి నా వెనక అంటూం డడం వింటూనే వుంటాను నేను! కాని యీ నాలుకలేని ఆడదాని తలమీదనే మగవాళ్ళు ఏకుమేకయ్యేది అని తెలిస్తే—అంత ఆనందించరు నా స్నేహితులు అనిపిస్తుంది. నూటరెండు జరంతో పక్క కెక్కినపూట తెలుస్తుంది అసలెవరు బలహీనవర్గమో 'అయ్యో! పాపం ఆయనగారు చెయ్యి కాల్చుకోవాలి కాబోలు!' అంటూ దుప్పటి కప్పుకుంటాం.

ఇక ఆ పూటకి వంటింట్లో మగవాడి రాజ్యం చూడవలసిందే. గట్టున పడ్డ చేపలా కొట్టుకుంటూ వంటింట్లోనే ఒలింపిక్ పరుగు పందెం కాస్తూన్నట్టు ప్రతి అయిదు నిమిషాలకీ కాఫీపొడి ఎక్కడ? ఉప్పు ఎక్కడ పెట్టావు? మిరపకాయలేవి? అంటూ ప్రశ్నలవర్షం కురిపిస్తూంటే—యిలా పడుకుని 'ఫలానాది అక్కడుంది. ఫలానాది యిక్కడ వుంది' అని చెప్పడంకంటే—లేచి తీసివ్వడమే హాయేమో అనిపిస్తుంది—ఒంట్లో ఎంత సుస్తీగా వున్నా.

అయ్యో నాకర్థంకాదు — వంటింట్లో అలమారు తెరిస్తే — మగవాడి కళ్ళకేదీ కనిపించదెందుకో. 'కాఫీపొడి ఎక్కడ?' అని అడుగుతూనే ఉంటారు—'నీ కళ్ళఎదుట' అంటామనుకోండి 'ఏదీ ? కనిపించడం లేదే' అంటూ సణుగుడు ప్రారంభిస్తారు. లేచి వెళ్ళి ఆకాఫీపొడిడబ్బా తీసి యిస్తాం. తీరా అది ఎంత దగ్గిరగా వుంటుందంటే—అదే నిప్పయితే — చెయ్యికాలేదే అతగాడికి! పోనీ వెతికిచ్చింది—అంత జ్వరంతోనూ అని సానుభూతీ కృతజ్ఞతా ప్రకస్తారని అనుకోకండి. అలాంటిదేంవుండదు. మీరంత సులభంగా దాన్ని తీసి యిచ్చినందుకు ఉడుకుమోత్తనం వస్తుంది. అంచేత తన చేతకానితనాన్ని కప్పిపుచ్చు కుందుకు 'అక్కడా పెడతారు కాఫీడబ్బా!' అంటూ ఎంత సిల్లీస్థలంలో మనం కాఫీడబ్బా పెట్టామో ఆశ్చర్యపడి, మన బుద్ధిహీనతకి జాలిపడతారు.

ఏ మగవాడినైనా సరే—ఒకటికి రెండు పనులు ఒకేసారి చెయ్యమనండి—ప్రమాదం తథ్యం. మనం—తల్లులం—భార్యలు—హాయిగా వంటా వార్పూ చేస్తూనే—చాకలి పద్దు చూస్తాం. ఏడిచే పసివాడిని వూరుకో పెడతాం, వూరుకో పెడుతూనే వాడు తడిపిన బట్టతీసి పొడిబట్ట కడుతూ వుంటాం. ఫోను వస్తే తీస్తాం. పక్కింటావిడకేదో కావలిస్తే అందిస్తాం. టిఫిను రడీ చేస్తాం, ఆఫీసరు గారికి బట్టలు తీస్తాం. పిల్లలు స్కూలుకి వెళ్ళడానికి సిద్ధం చేస్తాం; వారికి పెడతాం; తిను కెళ్ళడానికి కేరియరు సర్దుతాం—కాని మగవాడీ పనులన్నీ ఏక కాలంలో వూహించలేడు — చేయడం సంగతి దేవుడెరుగు!

ఉదయం పూట యింట్లో ఆడదాని స్థానంలో మగవాడిని పెడితే— కాళ్ళూ చేతులూ ఆడవు సరికదా - చిన్నమెత్తు యుద్ధరంగంగా మారుతుంది యిల్లు.

ఇంట్లో సాయంచేసే మగవాళ్ళే తక్కువ. ఆ చేసే వాళ్ళచేత చేయించుకోడం ఎంత కష్టమో — ఆడవారికే తెలుస్తుంది. మాట వరసకి యిల్లు దులపడం, దుప్పట్లు మార్చడం, మొదలైన సాదా పనులు వరసగాచెప్తే — సాయంత్రం అయేసరికి—చిన్న రామరావణ యుద్ధం తలెత్తుతుంది. ఆ యుద్ధంలో—ఆశ్చర్యం పిల్లలంతా సడెన్‌గా మీ పక్కానికి వచ్చేస్తారు; బంగారు పిట్టలా పెట్టి పోషిస్తుంటే యింకా సణుగుతున్నాం అంటారు. తనే ఎందుకు సంపాదించి పోషించాలి అంటూ బాధపడిపోతారు. ఆ బాధతో కోపంతో బయటికి విసురుగా వెళ్ళిపోతూకూడా జోళ్ళెక్కడ? కారు తాళం ఏది? అంటూ ప్రశ్నలే! యీసరికి బోనులో పులిలా హాల్లో అటూ యిటూ పచార్లు ప్రారంభం అవుతాయి. అలాటప్పుడు గబగబా జోళ్ళు వెతికిచ్చేయడం మంచిది. కారుంటే తాళాలు తక్షణం అందించడం మంచిది. వీధి తలుపు తెరిచి పట్టుకోడం మంచిదే.

ఓ గంటో రెండో స్నేహితులతో హస్కు కొట్టి ఆయనగా వస్తారు. ఆలోగా మీకు కాస్తంత విశ్రాంతి దొరుకుతుంది. యిల్లు సర్దుకొని హాయిగా కూర్చుని ఏ రేడియో ఏనా వినవచ్చు. తిరిగివచ్చాక వారు మరీ బిగుసుకుపోనూ వచ్చు—చిన్న కుర్రాడిలా. 'పోనిద్దురూ,' అంటూ మనం కొంచెం తప్పొప్పుకొని, సద్దేయనూవచ్చు. లేకుంటే ఎంత కోపంతో వెళ్ళారో అంత కోపంగానూ తిరిగి రావచ్చు. అయినా భయపడకుండా—తిరిగి పని చెప్పడమే మందు! ●

# చల్లనినీడలో నిప్పురవ్వలు

గౌతమ్



సరిగా ఏడాది తర్వాత మళ్ళా యింటికి వెళ్తున్నాను. యుద్ధం ముగిసి శాంతి నెలకొనడంతో ఆ భయానక వాతావరణం, గుండెలుకోసే దృశ్యాలూ తెరమరుగున పడుతున్నాయ్. అగ్నిగుండంలో నుంచి బయటకు నడిచి చల్లని నీడకోసం యింటికి పరుగెడుతున్నాను. రైలు స్టేషన్‌లో ఆగంగానే నాకోసం ఎదురు చూస్తున్న వాళ్ళంతా చుట్టుముట్టేశారు నన్ను.

మనసు హాయితో నిండిన చిరునవ్వుల్తో, ఆప్యాయత కురిపించే కౌగిలింతల్తో, కరచాలనాల్తో ఊపిరి సలపలేదు. దగ్గరగా నుంచుని మెరిసే కళ్ళతో నన్ను నిలువునా పరికిస్తోంది నా కాబోయే శ్రీమతి రాధ. చీరుకుపోయి గింట్లుపడిన కణతల్ని తన చల్లటి చేతితో తడిమి కన్నీరు నింపుకుంది అమ్మ. చెల్లాయ్ సంబరానికి హద్దే లేదు. తన పటాలం అందర్నీ తీసుకొచ్చిందేమో వాళ్ళంతా వచ్చి పూలమాలల్తో ముంచేశారు నన్ను.

ఎలాగయితేనేం కార్లో యింటికి ప్రయాణమయ్యాం. 'రోజూ పేపర్లో వార్తలు చదివి నీగురించి ఎంత గాబరా పడేవాళ్ళమో అంతా!' అంటూ వివరించారు నాన్న.

'నీకెక్కడ ప్రమాదం జరుగుతుందో అని రాత్రింబవళ్ళు కుమిలిపోయాన్రా బాబూ' అమ్మ ఆవేదనతో అంది.

అందరి ముఖాల్లో నేను సజీవంగా తిరిగి వచ్చినందుకు కలిగిన ఆనందం స్పష్టంగా కనిపిస్తోంది. చెల్లాయ్ ప్రశ్నలకి సమాధానాలు చెప్పలేక ఎకొసంగా వుండిపోయాను. నన్ను తన కళ్ళలో నిలుపుకోవడమే ధ్యేయమున్నట్లుగా చూస్తోంది రాధ. యీ సందడిలో తెలియకుండానే యిల్లు చేరుకున్నాం.

మధ్యాహ్నం డైనింగ్‌రూంలో కూర్చుని కబుర్లు మొదలుపెట్టాం.

'యుద్ధం జరిగినప్పుడు మీరెక్కడున్నార్రా?' నాన్న అడిగారు.

'మా బెటాలియన్ దినాజ్‌పూర్ ప్రాంతంలో యుద్ధం చేశాం నాన్నా'

'అక్కడ పోరాటం బాగా తీవ్రంగా జరిగినట్లు విన్నానే?'

'ఏమో నాకంతగా అన్పించలేదు. ఇదే కదా నేను మొదటిసారి యుద్ధంలో

పాల్గొనడం. కాని చాలామంది చనిపోయా ళక్కడ' అన్నాను నెమ్మదిగా.

'యుద్ధం బాగా ఘోరంగా వుంటుంది కదూ ?' రాధ అనుమానం.

'అది మామూలే — కాని అంతమంది చావుకు గురి కాకుండావుంటే బావుండేది. అదే నా బాధ.'

'మీరు క్షేమంగా ఎప్పుడు తిరిగివస్తారా అని ఎదురు చూస్తూనే గడిపాం యిన్ని రోజులూ. యింట్లోనుంచి కదలకపోవడంతో తిండి ఎక్కువయింది. కొంచెం లావెక్కాను కదూ?' నవ్వుతూ అడిగింది రాధ.

'యీలావుతోపాటు అనీమియావచ్చిపడుతుందేమో అని నా భయం' అమ్మ కామెంట్.

ఆ మాటల్తో నాకు నవ్వూ, బాధా ముంచుకొచ్చినాయ్. నేను తిరిగినచోటల్లా ఆకలితో నకనకలాడని మనిషి లేడసలు. ఓరకంగా ఆకలి మనిషిని జంతువుగా మారుస్తుందని చెప్పచ్చు. ఓ సంఘటన జ్ఞాపకం వచ్చి చెప్పకొచ్చాను.

'యుద్ధం అయిపోయిన తర్వాత ఓ రిలీఫ్ కాంప్‌కి వెళ్లాన్నేను. ఏ మనిషి ముఖంలో చూసినా ఆకలి తాండవమాడుతూండేది. తిండిపెట్టే రెండుగంటల ముందుగానే లైన్‌లో కూర్చునేవాళ్లు. వంటపాకనుంచి వచ్చే వాసనలు మింగుతూ ఎదురుచూసే వాళ్లు. తిండి పంచిపెట్టగానే రెండునిముషాల్లో తినేసి మళ్లీ భోజనం ఎప్పుడు దొరుకుతుందా అని ఎదురుచూసేవాళ్లు.'

'ముసలీ—ముతకా ఎలా తట్టుకునే వాళ్లురా ?' తన సందేహం బయట పెట్టింది అమ్మ.

'ముసలివాళ్ళయితే వాళ్ళదాకా వస్తేనే తినేవాళ్లుగాని, తిండికోసం ఎగబడేవాళ్ళు కాదు. లైన్‌లో కూర్చునే ఆకలితో కన్ను మూసిన వాళ్లు ఎంతమందో !'

'అబ్బ—అవన్నీ చెప్పకురా బాబూ— నాకు గుండెదడ పట్టుకుంటుంది' అంది అమ్మ కాఫీ తీసుకు రావడంకోసం లోపలికి వెళ్తూ.

మళ్లీవచ్చి, అమ్మ 'యింక నువ్వు జాప్యంచేస్తే లాభంలేదురా బాబూ—యీ శెలవులోనే పెళ్లి జరిగితీరాలి' పట్టుదలగా అంది.

యుద్ధం రాకముందు నాకూ త్వరగా పెళ్లిచేసుకోవాలనే వుండేది. కానీ యిప్పుడు మనసు వికలమయిపోయింది. జరిగిన సంగతులు తల్చుకుంటే భయం భయంగా అన్పిస్తోంది. చిన్నప్పుడు వీధిలో మోసుకుపోయే శవాల్ని, అమ్మకి తెలియకుండా కిటికీ చాటునుండి చూడటమే తప్ప చావంటే నాకు తెలియదు. కానీ నాతోపాటు పోరాడిన వాళ్ళెంతమంది నా ప్రక్కనే నేలకొరగడం చూశాను. వాళ్ళు చంపిన వందలాది మనుషుల్ని చూశాను. కాళ్లూ, చేతులూ తెగినవాళ్లూ, సగంకాలిన శవాలూ. చివరి క్షణాలు భయంకరంగా ముగించిన మనుషులూ— ఎన్నిచూశానో. ఓ హాకీగ్రౌండ్ నిండా చిన్నపిల్లల శవాలు లెక్కలేకుండా పడివుండడం చూస్తూ ప్రక్కనుంచే ముందుకు వెళ్ళగలిగాను.

ఇవన్నీ తల్చుకుంటుంటే ఓ మనిషి పెళ్ళిలో అందం ఏమిటూ అనిపిస్తోంది. మనిషి జీవితానికి అర్థం ఏమిటి? అసలిన్ని సంఘటనల్ని నడుపుతున్నదెవరు ? ఆలోచనల్తో పిచ్చెక్కినట్లవుతోంది. ఖాళీగా కూర్చున్నా, చెల్లాయ్ వాళ్ళతో పేకాట ఆడుతున్నా, నాన్నతోపాటు టెన్నిస్‌కి వెళ్తున్నా యివే ఆలోచనలు. ఎలా వీటిని భరించేది? ఎవరితోనైనా చెప్పకుందామన్నా వినేవాళ్ళెవరు? నాన్నగార్కి ఆయన బిజినెస్ గొడవల్తోనే సరిపోతుంది తప్ప నాతో కూర్చుని మాట్లాడే అవకాశమే లేదు. అమ్మకసలు అర్థం కావీ సంగతులు. రాధతో చెప్పడానికి సిగ్గుపడింది మనసు.

చెల్లాయ్ నాతో బాగా చనువుగావుండేది. కాని యిప్పుడది చాలా మారిపోయింది. బెల్‌బాటమ్స్, నడుముకి వేలాడే చైన్లు, పగలూ రాత్రీకూడా పెట్టుకు తిరిగే పెద్ద పెద్ద అద్దాల గాగుల్స్ — నేనూహించలేనంతగా మారిపోయింది. మాటవరస కూడా క్రొత్తగావుంది.

ఒకరోజు సాయంత్రం గాలి దుమారంలా వచ్చింది నా రూమ్‌లోకి.

'అన్నయ్యా — యివ్వాళ్ళ మా ఫ్రెండ్ యింట్లో పార్టీవుంది. అంతా నిన్నుకూడా తీసుకురావాలని పట్టుపట్టారు. త్వరగా డ్రెస్‌చేసుకో' అంటూ ఖంగారుపెట్టేసింది.

నాకు స్వతహాగా పార్టీలకి వెళ్ళాలంటే ప్రాణానికి సంకటంలా వుంటుంది. కాని యీ పార్టీలో అంతా యువతరం వాళ్లుంటారు. నా మనసులోని బాధ అర్థంచేసుకోగల వాళ్లుండచ్చు అనే ఆశతో బయల్దేరాను.

పార్టీలో అంతా తెల్సినవాళ్లే — నాతో కల్సి చదువుకున్న వాళ్లే! అంతా పెద్ద పెద్ద బిజినెస్‌మాగ్నెట్‌ల పిల్లలు. అందరిలోనూ మార్పు కనపడ్తోంది. కొంతమంది కుర్రాళ్ల జుట్టూ, సైడ్‌లాక్స్ వివరీతంగా పెంచేశారు. కొంతమంది గడ్డాలు పెంచేసి సర్దార్లని మించిపోయారు. బెల్ బాటమ్స్‌లో, జీన్స్‌లో వింతగా తయారయ్యారు అమ్మాయిలు. అంతా గాగుల్స్ పెట్టుకునే వాళ్లే. సిగరెట్ త్రాగనివాణ్ణి నేనొక్కణ్ణే అయ్యాను! ఒకతను డ్రింక్‌తో పాటు సిగరెట్ అందించాడు. 'సారీ—నేను సిగరెట్ త్రాగకూడదు. ఒకసారి ఆర్టిలరీ మందుడిపో పేలి గంధకం పొగ ఎక్కువగా పీల్చేశాను. అందుకని కొంతకాలం సిగరెట్ మానెయ్యమని చెప్పారు డాక్టర్' కారణం చెప్పక తప్పలేదు.

పార్టీలో అంతా ఒకదానిమీద ఒకటిగా కబుర్లు అల్లేస్తున్నారు.

'ఏ విషయాన్నయినా పెర్‌స్పెక్టివ్‌గా చూస్తేనే అర్థం అవుతుంది.' అన్నాడొకతను.

ఆ మాటల కర్థమయితే నాకు తెలియదుగాని, విషయాన్ని స్టెప్‌బై స్టెప్‌గా ఆలోచించాలి కాబోలనుకున్నాను. ఇంకొకతను మారణహోమం అంటే ఏమిటో నిర్వచించాడు. అతని మనసులో మృత్యుదేవత కూర్చుని పలికిస్తున్నట్లుగా అన్పించింది నాకు. 'బంగ్లాదేశ్‌లో ఘోరాలు చాలా జరిగినాయిగాని, వాటన్నిటినీ మారణహోమం క్రింద జమకట్టలేం. అవన్నీ మారణహోమం అనే లెవెల్‌కి చేరుకోలేవ్' అంటాడతను.

అందరి ముఖాల్లోనూ విచారం కనిపించింది. అతని మాటలకి అంతా బాగా కదిలిపోయినట్లుగా అన్పించారు.

అంతా యుద్ధం గురించి వాళ్ళు విన్నవీ, చదివినవీ చర్చించడం మొదలు పెట్టారు. 'బజూకా, మోర్టార్' అంటూ వాళ్లెప్పుడూ చూడని వాటి గురించి మాట్లాడేస్తున్నారు. అటాక్‌నీ—అస్సాల్ట్‌నీ ఒకటిగా చేసి చెప్తున్నారు. ధోరణి చూస్తే పెద్ద పెద్ద మాటలు వాడాలనే తహతహ

క్నపడ్తోంది అందర్లో.

'అసలు యుద్ధం ఎలా చేస్తారోయ్? కిందకాల్లో కూర్చునేగా?' అడిగాడొకతను.

'అవసరాన్నిబట్టి నేలమీద ప్రాకుతూ, పరుగెత్తుతూ కూడా కాల్పులు వెయ్యా ల్సొస్తుంది' అన్నాను.

'మనవాళ్ళ పాకిస్తాన్‌వాళ్ళ టాంక్‌లూ, విమానాలూ, ఆర్టిలరీ గన్స్ అన్నీ నాశనం చేసేశారుకదా? అప్పుడు వాళ్లేం చేసే వాళ్ళు?' కుతూహలంగా అడిగిందొక అమ్మాయ్.

'అన్నీపోయినా శత్రువు ఆ చోటు వదిలి పెట్టడు. అప్పుడు ట్రెంచెస్‌లోంచి బయ టకువచ్చి వాళ్ళని కాల్పులతో ఎదుర్కొనే వాళ్లం. ఒక్కోసారి గంటలు గంటలు పట్టేది వాళ్ళని తుడిచిపెట్టడానికి' బరు వుగా వచ్చింది నా సమాధానం.

డిన్నర్ అయిన తర్వాత అంతా లాన్‌లో కూర్చున్నాం. నాతోపాటు చదివిన ఒకతను కవిగా మారాడట. తను వ్రాసిన ఒక కవిత చదవటం మొదలుపెట్టాడు. అదీ ఓ కవరు వెనకాల వ్రాసినట్లున్నాడు.

'బంగారు వంగదేశంలో

నీలి ఆకాశం క్రింద నెత్తురు కురు స్తోంది.'

ఆవేశంగా పలుకుతున్నాడు పదాలు. నా కయితే నవ్వు వచ్చింది. నేను చూసిన నిజా నికీ, ఆ కవితకీ పొంతనలేదు. ఎన్నడూ ఆర్టిలరీగన్‌గానీ, టాంక్‌గానీ చూడని వాడు వాటిమీద కవితలల్లాడు. కవిత చాలా

# చల్లని నీడలో...

బరువుగా నడుస్తోంది.

'ఏమయినా కామ్రేడ్స్ — మీ త్యాగం
వృధాకాదు,
మానవాళి ఎన్నటికీ మిమ్మల్ని మరచి
పోదు'

అంటూ ముగించాడు. అందరి ముఖా ల్లోనూ బాధ అల్లుకుంది.

'నీకు నా కవిత నచ్చిందా? రియ లిస్టిక్‌గా వుందికదూ?' అడిగాడు కవి.

'జరిగిన దాన్ని నువ్వు ఊహించిన తీరులో బాగానే వ్రాశావ్' అన్నాను బరువుగా.

'అంటే యదార్ధంకాదనా నీవుద్దేశ్యం?' దెబ్బతిన్నట్లుగా అడిగాడు.

'నేను చూసిన నిజాలు కొన్నిచెప్తాను. దాన్నిబట్టి నువ్వే అర్థంచేసుకో'అన్నాను. అంతా సీరియస్‌గా వినడానికి తయా రయారు.

'నువ్వు చెప్పిన వంగదేశంలో నీలి ఆకాశం అందాన్ని నేను చూడలేదు. కటిక చీకటిలో, నక్షత్రాలవెల్తురు తోడుగా నాకు పేరు తెలియని నదిలోకి బోటునితొయ్యడం జ్ఞాపకం వస్తోంది. అందులో అయిదుగురు పిల్లలున్నారు. అందరిలోకీ పెద్దవాడు పద్దెనిమిదేళ్ళవాడు. వాళ్ళ పని ఓ వంతెన పేల్చెయడం. ఆ వంతెనకి చేరుకోకముందో అది పేలిన తర్వాతో వాళ్ళ చావు తప్పదని నాకు తెలుసు. వాళ్ళకీ తెలుసు. మీలాగా వాళ్లెవరూ జుట్లూ, గడ్డాలూ పెంచుకో లేదు. ముఖాల్లో చావుచూపు కన్పించ లేదు నాకు. ఒకింత భయం వున్నదన్నుకో వాళ్లలో. అయినా చిరునవ్వుతో ముందుకు సాగారు. పద్దెనిమిదేళ్ల వయసులో చావుకి ఎదురు వెళ్లడం సామాన్యమైన పని కాదు'

'అబ్బ—వాళ్లనెలా పంపించ గలిగారండీ మీరు!' అందొక అమ్మాయి ఆశ్చర్యంగా.

'నేను చెయ్యగలిగింది ఏముంది అందులో — మా పోరాటంలో చాలా వూళ్ళుదాటి వెళ్తుండే వాళ్లం. ఒక వూళ్ళో సంగతి. ఒక్క మనిషికూడా లేడక్కడ. కాని ప్రతి యింటిముందూ ఓ పసివాణ్ణి బాయొనెట్‌మీద గుచ్చి వుంచారు. ఒకచోట ఒక స్కూల్‌లో ఆడ పిల్లలందర్నీ తమ కోరికకి బలిచేసి చంపే శారు, ఓ పాకిస్తాన్ బెటాలియన్—బెటాలి యన్ అంటే ఎంతమంది వుంటారో తెల్సా? దాదాపు వెయ్యిమంది. యిలాం టివి యింకెన్నో. యిదంతా మారణహోమం కాదా?' అన్నాను.

భయంభయంగా చూశారంతా.

'కవిత వ్రాయాలంటే యివన్నీ చూసి వాటిలోని తీవ్రత తెలిసివుండాలి. అప్పుడే అందులో జీవం ఉండేది' నా ఉద్దేశ్యం చెప్పాను. నిస్సహాయంగా చూశాడు నా కవి ఫ్రెండ్.

శెలవులో వుండగానే నాకు అవార్డు వచ్చినట్లుగా తెల్సింది. అంతా వచ్చి అభినందనలు తెల్పారు. నిజానికి దీనికి కారణం నాతోపాటు పోరాడి మరణించిన

హరిరామ్స్



జవాన్లు. 'అవార్డు ఏ సందర్భంలో యిచ్చారని అడిగారు స్నేహితులంతా. అవన్నీ తల్చుకుంటే మనసు మూగ పోతుంది. అయినా చెప్పక తప్పలేదు.

'యుద్ధం మొదలయిన మొదటి రాత్రి సంగతి. ఆరాత్రే నా కంపెనిలో తొమ్మిది మంది చనిపోయారు. ఒక అవుట్ పోస్ట్ పట్టుకోవడం నా పని. విపరీతమయిన గన్స్ కాల్పులు ఎదుర్కోవాల్సి వచ్చింది. శత్రువు బలమయిన ప్రతిఘటన చేస్తు న్నాడు. వేరే ఉపాయం లేక నూటిదాడికి దిగాను నా కంపెనీతో. ఆ అవుట్‌పోస్ట్

పక్కనే మెయిన్‌రోడ్డు వుంది. కొంచెం సేపట్లో అటుగా వెళ్లే సప్లయ్ ఆపాలి. ప్లాన్ లేదిక. హఠాత్తుగా శత్రువుని ఎదుర్కొందామని ప్లాన్‌వేశాను. కాని దగ్గరగా వెళ్లేసరికి అన్ని ప్రక్కల్నుంచీ మెషిన్‌గన్‌లు గుళ్లవర్షం కురిపించాయి. చేతిబాంబులు సందులేకుండా పేలాయి. అయినా ముందుకు సాగాం. చివరికి బాయొనెట్లు ఉపయోగించి ఆ పోస్ట్ పట్టుకుని మావిధి నెరవేర్చాం. ఆ దాడిలో నా కంపెనీలో

# చలని నీడలో...

దాదాపు సగంమంది జవాన్లు నేలకొరిగారు' అన్నాను గొంతు పూడుకుపోతుంటే.

'బాయొనెట్ ఓ మనిషిలో దిగబడిపోతే ముందుకెలా సాగుతారు?' అడిగాడొకతను.

'ఏదోవిధంగా బయటకు లాగాలి. లేకపోతే ఓ రౌండ్ కాలుస్తే ఆ షాక్‌కి అదే బయటకు వస్తుంది. యీ లోపల కొన్ని క్షణాలు వృధాకాక తప్పదు మరి.'

ఆ కొన్నిక్షణాల విలువ నాకు బాగా తెల్సు. మా సుబేదార్ మరణం మదిలో మెదిలింది. అదే చెప్పటం మొదలుపెట్టాను.

'ట్రెంచ్‌లోనుంచి కాల్పులు సాగిస్తున్నాను ఒకసారి. నా మనుషులంతా చెల్లాచెదురయిపోయారు. కంట్రోల్ పూర్తిగా లేదు. నాకు దగ్గర్లో మా సుబేదార్ వున్నాడు. దిగబడిపోయిన బాయొనెట్ బయటకులాగే ప్రయత్నంలో వున్నాడు. క్షణంలో వో పాకిస్తాన్ జవాన్ బాయొనెట్ సుబేదార్ వీపుమీద మెరిసింది. ఆ క్షణంలో కదలకూడదతను. ఆత్మరక్షణ కోసం మెరుపులా వెనక్కి తిరిగాడు. కాని అప్పటికే అతనిలో గుచ్చుకుపోయింది ఆ బాయొనెట్. నేను కాల్చిన రౌండ్‌కి ఆ జవాన్‌కూడా నేలకొరిగాడు. ప్రక్కనేవుండీ అతన్ని కాపాడలేకపోయాను.' బాధతో నిండాయి నా మాటలు.

'యివన్నీ వింటుంటే యుద్ధానికి దిగే మనిషి ఎంత కిరాతకుడా అనిపిస్తుంది' అన్నాడతను.

'ఆ సుబేదార్ కుటుంబం ఏమయ్యిందిరా పాపం?' ఆ తర్వాతొకసారి అడిగింది అమ్మ.

'యుద్ధం అయిపోయిన తర్వాత వాళ్లని కల్సుకున్నాను. అతని భార్య మన రాధకన్నా చిన్నదే. యిద్దరు పిల్లలు. అతని తల్లి గోడుమంటూ ఏడ్చింది నన్ను చూసి. 'బాబూ—మీరు ఆఫీసర్లు. నా కొడుకి లాకూలిపోయాడు — మీరే ఆదుకోవాలి మమ్మల్ని' అంటూ గొల్లుమంది. అతనికి అవార్డు వచ్చేలా వ్రాయించాను. అతని భార్యకి పెన్షన్ యిస్తారు. పిల్లలు ఎంతవరకూ చదువుకున్నా జీతంలేదు.'

ఏలాగయితేనేం జవాబు చెప్పగలిగాను.

ఇదే చింత నన్ను పట్టుకు వేధిస్తోంది. యిరవైఏళ్ళ వయసులో విధవరాలైన ఆమె జీవితం ఏమయిపోతుంది? యిలా ఎన్నివేలమంది కుమిలిపోతున్నారో యుద్ధం మూలంగా? యికం యీ జీవితానికీ, పెళ్లికీ అర్థం, ప్రయోజనం ఏమిటి? ఇదే ఆలోచన మనసుని తినేస్తోంది. నిద్రలేకుండానే రాత్రిళ్ళు గడిచిపోతున్నాయ్. కన్నుమూస్తే బోట్‌లో పిల్లలు, బాయొనెట్ గుచ్చుకున్న సుబేదార్ అంతా కనిపిస్తున్నారు. ఏదో భయం మనసంతా ఆవరిస్తోంది.

ఒక్కోసారి పిచ్చికోరిక పుడ్తూవుంటుంది. నాదగ్గరే గ్రెనేడ్లపెట్టె వుంటే ప్రతియింటిమీదా ఒకటి విసరాలనిపిస్తోంది. ఎక్కడో వెయ్యిమైళ్ళదూరాన జరిగిన యుద్ధం యిక్కడే, యీ వూరి వీధుల్లో జరగాలనిపిస్తోంది. నామీద నాకే అనుమానం కలుగుతోంది. ఎలా యీబాధ మరచిపోవడం? అయినా యుద్ధాలు జరగవనేమిటి? ఎక్కడో యింకో ఆఫీసర్ యిలా దాడి నడపడా? యింకో సుబేదార్ పెళ్లాం పిల్లల్ని అనాధల్నిచేసి కన్నుముయ్యడా? యివన్నీ జరిగేవే మరి.

ఒక విషయానికీ, యింకో విషయానికీ పొంతన కుదరటంలేదు. వేషం, భాష మార్చిన చెల్లాయ్ కబుర్లు, యుద్ధం, ఆకలి అంటే ఏమిటో తెలియని కవిగారి కవితలు, బిజినెస్‌తో సతమతమయ్యే నాన్న మాటలు, రేడియోలోనూ, పేపర్లోనూ తాండవంచేస్తున్న యుద్ధం గురించిన కథలూ, బంగ్లాదేశ్‌లో మారణహోమం చూపించే సినిమాలూ — యివన్నీ నన్ను వెక్కిరిస్తున్నట్టుగా అన్పిస్తోంది. యివన్నీ ఒకే జీవనగతిలో ఎలా యిముడుతున్నాయ్? వేటికవి వేరుగా చూస్తే యదార్థాలయినవి—అన్నీ కలిసి నాలో తుఫాన్ రేపుతున్నాయ్.

యీ ఆలోచనల్తో పిచ్చెక్కేలా వుంది. మనసుకి శాంతికోసం యింతదూరం వస్తే యీ ఆలోచనలు నన్ను నిలువునా కాలుస్తున్నాయ్. వేరే దారిలేక శెలవ్ పూర్తి కాకముందే యూనిట్‌కి ప్రయాణమయ్యాను. ●

# మధ్యాహ్నవేళ

డా॥ సి. నారాయణరెడ్డి



మంచుకు చెమట పుడుతున్న
మధ్యాహ్నవేళ.
మహాజనం సమ్మెకడుతున్న
మధ్యాహ్నవేళ.
పగలు పన్నెండు గంటలు
తెగ మోగుతున్న వేళ
ఫ్యాక్టరీల్లో అంటుకునే
హక్కుల హుతభుక్కుల జ్వాల.
మాయని పుడమి గాయాలు
మార్తాండ బింబాల్లా మండుతున్న
మధ్యాహ్నవేళ.
ఆకలి పెనురోకలి పట్టుకుని
అపర బలరాముడిలా చెలరేగేవేళ
తీసుకున్నదీ తిన్నదీ అరగక
తీపిమరిగిన తివాసీలు తేన్చేవేళ.
పేగులు రుద్రవీణ తీగలుగా
బొమికలు ప్రళయకాల డమరువులుగా
పిచ్చిగా రెచ్చిపోతున్నవేళ
పిండిగా నలిగినోళ్ల గుండెలు
డిండిమాలుగా మారుతున్న
చండ ప్రచండవేళ.
టియర్ గ్యాస్ పేలిన చప్పుడులోనుంచి
బుల్లెట్లు కంటుకున్న చల్లటి నెత్తుటి ఉప్పెనలోనుంచి
కోలాహలం గీపెట్టేవేళ.
కోటి గొంతుకల చెకుముకుల రాపిడిలో
కొత్త మిణుగురులు తొడకొట్టేవేళ.
నగరం నడిబొడ్డులోనుంచి
నవ్యకాంతి కమలం ప్రసవించేవేళ.
యువజగతి— చచ్చు చెలియలికట్టల
అవధులను అతిక్రమించేవేళ.
మరోతరం ఉదయించేవేళ— ఆ
మధ్యాహ్నవేళ.

# ఒక వారం విపరీతం — పాలాక్షుడు

## కీచులాట వ్యాపారం

పాండిచ్చేరి తిరుభువనై గళి తీర్థాళ్ కుప్పానికి చెందిన 40 ఏళ్ల చిన్న తంబికి, 40 ఏళ్ల జ్ఞానవేల్ అనే వో స్వామిజీకి తామచేసే వ్యాపారంలో కీచులాట వచ్చిందట. ఈ కీచులాట రగడుగా మారి, అది ఆస్థితి కూడా దాటటంతో చిన్నతంబి కత్తొకటి తీసుకుని, జ్ఞానవేల్ స్వామిగారిని, పొడిచి చంపి, పారిపోయాడట. చట్టం అతన్ని పట్టుకుని అయిదేళ్ల శిక్ష విధించింది. అవ్వాళవుదానా, అంతేనా ...

## ఈశ్వరునికి ఉత్తరం!

రాజకోటకు చెందిన ఆమెసార్ అనే గ్రామంలో కాశిజీ అక్బర్ అనే యువకుడు సౌరాష్ట్ర ప్రాంతాన్ని కరువు కాటకం నుంచి రక్షించమని ఈశ్వరుణ్ణి ప్రార్థించి, అంతతో ఆగక, తన చిటికిన వేలుకోసి,




ఈశ్వర లింగానికి రక్తాభిషేకం చేసి, అంతటితోనూ సంతృప్తి పడక, ఆశివాలయంలోనే ఉరిపోసుకుని ఆత్మాహుతి చేసుకున్నారట. కరువుకాటకం నుంచి సౌరాష్ట్రాను రక్షించమని ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తూ అతను వో పది పేజీల వుత్తరం రాశాడుట.

## పిల్లల్నికనే దంపతులు కావాలి!

ఫిలడల్ఫియాకు చెందిన వో వార్తా పత్రికలో ఒక వింత ప్రకటన వచ్చిందట. పిల్లలు లేని జంటకొకకు ఎవరైనా ఒక అందమైన అమ్మాయి పిల్లను (లేక పిల్లవాడిని) కనివ్వగలిగితే, ఆ అమ్మాయికి పదివేల డాలర్లు బహుమతి యిస్తామని, అంతేకే గర్భవతి అవదల్చుకున్న ఆ అమ్మాయి పిల్లలు కావాల్సిన ఆ జంటలోని పురుషుని వల్లనే గర్భం ధరించాలని ఆవార్త అన్నదట. అంతే గాక ఆ అమ్మాయి చక్కని అందాలా భరిణ అయ్యుండాలని, తెలివైనదీ, చురుకైనది 26 ఏళ్ళు నిండనిది అయ్యుండాలని కూడా ఆవార్త వివరించిందట.

ఈ ప్రకటనకు వుప్పెనగా మేం ధరిస్తామంటే, మేం ధరిస్తాము అని కొన్ని వందల దరఖాస్తులు వచ్చాయట. ఆ ప్రకటన యిచ్చిన ఆసామీ పరారై ఆనక దొరికి, అదేమంటే, స్త్రీలలో డబ్బుకు పిల్లలను పరాయి వానిక్కనే వుత్సాహం ఎంత మందికి ఎంతశాతంవుందో తెల్సుకోవాలని ఈపని చేశానని చెప్పాడట— హారి పిడుగా!

## నిమిషాల్లో మానభంగం

అమెరికా లెక్కల ప్రకారం అక్కడ స్త్రీల మానభంగాలు చాలా ఎక్కువగా జరుగుతున్నాయని, ప్రతి 13 నిముషాలకు వో స్త్రీ మానభంగం జరుగుతోందని నేర పరిశోధన శాఖ వివరించింది. అంతేగాక, ప్రతి 30 నిముషాలకూ వో హత్యా, ప్రతి 39 సెకనులకూ వో నేరం, ప్రతి 82 సెకనులకూ వో దొంగతనము, ప్రతి 86 సెకనులకూ వో అమెరికను పౌరునిపై దవుర్జన్యము జరుగుతోందని కూడా అక్కడినేర పరిశోధకశాఖ విన్నవించిందట— ఇండియా లెక్కా లెక్కడ!

## హరిశ్చంద్రుని అసలుస్వరూపం

రామ్‌పూరులో వో ఉత్తమోత్తముడు నేరుగా పోలీసు స్టేషనుకు వెళ్ళి తాను తన భార్యను హత్య చేసినట్టు ప్రకటించి ఆత్మహత్య చేసుకునేలోగా తనను అరెస్టు చేయమని ప్రాదేయ పడ్డాడట. పోలీసు వివరాలడుగుతే తన భార్యను ఫలానా చోట భూస్థాపితం చేసినట్టు విన్నవించాడట. ఆఫలానాచోటు వెతికితే అక్కడేమీలేదట. అదేమంటె నేను నాభార్యను తొమ్మిదొందల రూపాయలకు తెగనమ్మితిని అన్నాడట. తిక్కరేగిన పోలీసు ఆతని భార్యను వెతికి, పట్టుకున్నారట. ఆనక అతన్ని అరెస్టు చేశారట. అసలీహరిశ్చంద్రుని ఆంతర్యంబేమై యుండునో!

## తాగిన మైకం తెచ్చిన తంటా

చిత్తూరు జిల్లాకు చెందిన తడగర గ్రామంలో రామచంద్రయ్య అనే ఆయన వో పెళ్ళికి వెళ్ళాడట అక్కడ హాయిగా తాగి, ఆ తాగినమైకంలో అదేస్థితిలో వున్న మరికొందరితో వాగ్వాదన పెట్టుకున్నాడట. దాంతో చిన్నగాం పల్లెకు చెందిన వో ముగ్గురు వ్యక్తులు ఆయన్ని కత్తితో పొడిచి పారిపోయారట. దాంతో రామచంద్రయ్య, అక్కడికక్కడే చనిపోయాడట.

## మాటకి మాట తెగులు

బెంగుళూరు తుమ్‌కూరు రోడ్డులో వున్న వో హోటలుముందు లారీఆపి, నిర్మల్‌సింగ్ దువేంద్రసింగ్ అనే యిద్దరు డ్రయివర్లు భోజనానికి ఆ హోటలు కెళ్ళారట. భోంచేస్తుండగా యిద్దరికి ఏదో మాటా మాటా వచ్చి అది పెచ్చు పెరిగిపోయిందట. దాంతో దువేందర్ సింగ్ రెచ్చిపోయి చటుక్కున కత్తితీసి, నిర్మల్‌సింగ్‌ను పొట్టలో తీవ్రంగా పొడిచాడట. నిర్మల్‌సింగ్ రక్తపు మడుగులో విల విలా తన్నుకుని, అక్కడికక్కడే చనిపోయాడట—కురుక్షేత్ర యుద్ధానిక్కారణం పొరపొచ్చాలే కదా! కాదా!!

## డబ్బుకోసం!

అమోరి (జపాన్) లో ఒక వ్యాపారస్తుడు తన వ్యాపారంలో కుదేలైపోయాడట. అతని తొమ్మిదేళ్ళ కూతురి పేర 70 వేల డాలర్ల (501 లక్ష) కు జీవిత భీమా వున్నదట. ఆడబ్బుకోసం అతను తన కూతుర్ని చంపడానికే నిర్ణయించుకున్నాడట. దీన్ని కార్యరూపంలో పెట్టడానికి ఒక్కొక్కడికి 5 వేల(రూ.36,500) డాలర్లు కూలీగా యిస్తాననేయిద్దరు కిరాయిహంతకులతో బేరమాడి నిశ్చయించాడట. ఆనక పథకం ప్రకారం ఆతను, ఆ కూతురు, రోడ్డుమీద నడుస్తుండగా యీ కిరాయి హంతకులు కారులో వెనకాలే వచ్చి ఆమె మీదుగా పోనిచ్చారట. పథకం ప్రకారం ఆమె అక్కడికక్కడే చనిపోయిందట. తనకోర్కె ఈడేరిన సంబరంతో ఆమెతండ్రి ఠెంగున ఇన్సూరెన్సు కంపెనీకి వెళ్ళి తనకూతురు కారు ప్రమాదంలో చనిపోయిందని, కనుక తనకు ఆబాపతు ఇన్సూరెన్సు డబ్బు వెంటనే యిచ్చివేయాలని తొందర పెట్టాడు. ఈతని ఆత్రం, ఆనందం, వుత్సాహం...యివన్నీ చూసి, పోలీసులకు అనుమానం వచ్చి తీగ కదిపారట. దాంతో విషయమంతా బయట పడింది. అందుకనే డబ్బు పాపిష్టిదని మనవాళ్లెప్పుడో అన్నార్లు.



# మితాహారం



బులుసు వేంకటరమణయ్య ——— ధర్మపథం

ఆహారాన్ని మితంగా తీసుకోవాలి, మితంగా భుజించినప్పుడే ఆరోగ్యం బాగా వుంటుందని వైద్యులుకూడా చెప్తారు. ఆరోగ్యం సరిగా ఉన్నప్పుడే ఏ యోగ సాధనకయినా అవకాశం ఉంటుంది. ఆరోగ్యం కాపాడుకోడానికి మితాహార స్వీకరణం మిక్కిలి అవసరం.

భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు యోగాన్ని గురించి చెప్పే సందర్భంలో 'యుక్తాహార విహారస్య ... యోగో భవతి నాన్యథా' అని అన్నాడు. ఆ యుక్తాహారమంటే మితాహారమని తెలుసుకోవలసి ఉన్నది.

మానవ శరీరంలోని అన్నకోశంలో నలుగు భాగలున్నవి. ఆ నాల్గు భాగాలనూ ఆహారంతో నింపితే కడుపు బేరివలె తయారవుతుంది. అది అమితాహారమవుతుంది. మూడు భాగాలు నింపిన ఆహారమున్నూ అమితాహారమే. అందువల్ల అన్నకోశంలోని రెండు భాగాలను నింపిన ఆహారమే మితాహారం అవుతుంది. ఒక భాగాన్ని ద్రవపదార్థంతో నింపాలి. నాల్గవభాగం ఖాళీగానే ఉండాలి. వాస్తవానికి అది ఖాళీగా ఉండదు. దానిలో గాలి నిండి వుంటుంది.

ఈ విషయాన్నే ఈ శ్లోకం తెలియజేస్తున్నది —

'ద్వౌ భాగౌ పూరయేదన్నైః
తోయేనైకం ప్రపూరయేత్,
మారుతస్య ప్రచారార్థం
చతుర్థ మవశేషయేత్ ॥

అన్నకోశంలోని నాలుగు భాగాలలోను రెండు భాగాలనే అన్నంతో నింపాలి. ఒక భాగాన్ని నీటితో నింపాలి. వాయు ప్రచారానికి అనుకూలంగా ఒక భాగాన్ని ఉంచివెయ్యాలి అని దీని అర్థం.

అన్నం జీర్ణం కావడానికి ద్రవంయొక్క ఆవశ్యకత ఎంతో వుంటుంది. వాయు సహాయం లేనిదీ అన్నం జీర్ణం కాదు. దీనికి వ్యతిరేకంగా ఉంటే ఆరోగ్యం చెడుతుంది. ఆరోగ్యం చెడితే తాను సాధన చెయ్యడానికి సాధ్యంకాదు సరేకదా, నిత్యకృత్యాలు జరపడం కూడా సాధ్యం కాదు. 'సగం కడుపుకే తినాలి' అని సాధారణంగా అనుకోవడానికిన్నీ ఇదే కారణం. ●

## మనుషులకి పందుల ఆహారమా!

బెంగళూరు జలహళ్ళి విమాన దళానికి చెందిన పాకశాలలో మిగిలిన చెత్తా చెదారాలను పందులకు వేయడానికి కొని, అక్కడి పేదప్రజలకు ఆహారంగా అమ్ముతున్నట్లు తన మీద రాష్ట్ర మునిసిపల్ పరిపాలనా శాఖామాత్యులు బసవలింగప్పగారు చేసిన నేరారోపణ ఏ ఆధారమూ లేనిదని ఆకంట్రాక్టరు నరసింహన్ అన్నారట. అంతేగాక ఆమంత్రిగారి మీద కోర్టులో పరువు నష్టం దావా దాఖలు చేశాడటాయన.

## ప్రేమలో ప్రమాదం

తిరుచ్చికి చెందిన నారాయణన్ అనే ఆయన కూతురు 20 ఏళ్ళ విజయకాంతం తిరుచ్చి టెలిఫోను ఆఫీసులో ఆపరేటరు పని చేస్తోందట.



ఆమె మేనమామకొడుకు 19 ఏళ్ళ రాజవేల్ ఆమెను ప్రేమించి తనను వివాహం చేసుకోమని సవాలక్ష సార్లు విజయకాంతాన్నడిగినా ఆమె ససేమిరా అన్నదట. దాంతో అతనికి తిక్కరేగి, ఆవిషయాన్ని తేల్చి పారేయాలని మొన్న 7వ తేదీ మధ్యాహ్నం రెండు గంటలకు వరగనేరి కొత్తరోడ్డులో దారి కాసి, ఆమెను వెంబడించి, నిలేసి తనను పెళ్ళి చేసుకోమని అడిగాడట. ఆమె ఏమాత్రం సమ్మతించక పోయే సరికి ఆత్రంతో కత్తితీసి, ఆమెను తూట్లు తూట్లుగా పొడిచి, చంపిపారి పోయాడట.

## పావురాలతో ఫొటోలు

ఒలింపిక్ ఆటలు చూచి వ్రాయవచ్చిన ఒక డెన్మార్కు పత్రిక ఫోటోగ్రాఫరు తాను ఆటలకు తీసిన ఫోటోలను తనతో తెచ్చుకున్న రెండు పెంపుడు పావురాల మెడలకు కట్టి, డెన్మార్కెళ్ళండమ్మలూ అని గగనంలో వదిలేశాడట. ఆరెండు పావురాలూ కీల్ నుంచి డెన్మార్కుకు మూడున్నర గంటలలో ప్రయాణం చేసి, ఫోటోలను చేర్చాయట. సామాన్యంగా ఉత్తరం కీల్ నుంచి డెన్మార్కు వెళ్ళడానికి 20 గంటలకు పైగా పడుతుందట— అద్గదీ, అందుకే పురాణ కాలంలో ప్రేమవంటి అర్జంటు వ్యవహారాలు పక్షుల చేతుల్లో పెట్టేవారు.

* * *

రామనాథపురం జిల్లా దేవకుంట అనే వూరుకు చెందిన 28 ఏళ్ళ కుళందై అనే అతను, 32 ఏళ్ళ సొక్కు అనే అతను ఇద్దరూ ఏవైనా పంట పనులు దొరుకుతాయేమోనని మద్రాసు వచ్చి తేనాం పేటలో ఓ గదిఅద్దెకు తీసుకునుంటున్నారట. వీరిద్దరికి అసలు వాళ్ళూరిలోనే ఏవో భూమితగాదాలున్నాయట. రూములో తీరుబడిగా కూర్చుని గతాన్నంతా తవ్వుకుని కోపోద్రేకాలతో ఒకర్నొకరు తిట్టేసుకున్నారట. కసిపుట్టిన సొక్కు నిద్రపోతున్న కుళందైని కత్తితో తూట్లు తూట్లుగా పొడిచి, పారిపోయాడట. కుళందై రక్తపు మడుగులో గిలగిల తన్నుకుని చనిపోయాడట.

## అత్తపోరు భరించలేక ఆత్మహత్య

దిండివనానికి చెందిన నటరాజన్ అనే అతనిభార్య 25 ఏళ్ళ చిన్నప్పొణ్ తన పుట్టింటివారూ అదే వూరిలో వుండడం వల్ల పుట్టింటికి అప్పుడప్పుడు వెళ్తూ వుండేదట. ఒకనాడామె పుట్టింటికి వెళ్ళి, తిరిగొచ్చేసరికి అత్తగారు ఆలివెడు మాటలన్నదట. దాంతో జీవితం మీద విరక్తి పుట్టిన చిన్నప్పొణ్

(62వ పేజీ చూడండి)



# ఫారిన్ రిటర్న్డ్ లేక స్వదేశీ ఉద్యోగ పర్వాలకు అతీతులు

లేళ్ళపల్లి వెంకటలక్ష్మీనారాయణ

## రెండవ కథ



## ఫారిన్ రిటర్న్డ్ స్వదేశీ నిరుద్యోగి

✱ఫారిన్ రిటర్న్డ్ పద్మనాభం బ్రీఫ్ కేస్ (జేమ్స్‌బాండ్ టైప్) చేతోపట్టుకుని డిపార్ట్‌మెంటువేపు బయల్దేరారు. అతగాడి డిపార్ట్‌మెంట్‌లో జేరి రెండ్రోజులయ్యింది. ఇవ్వాళ మూడోరోజు. మొదట్రోజు డిపార్ట్‌మెంటంతా 'గ్లాచ్యావిూచ్యా', 'ఘ్యా' అంటూ తిరిగాడు. రెండోరోజున తను తిరిగిన ప్రదేశాలగురించి అడిగినవాడికీ అడగనివాడికీ...అందరికీ చెప్పాడు. అడగనివాడికి చెప్పేందుకో పద్ధతుంది.

'శాన్‌ఫ్రాన్సిస్కోలో యిట్లావుంటుంది. బట్ యిన్ పారిస్ యిటీజ్ సంథింగ్ ఎంటైర్లీ డిఫరెంట్' అంటాడు.

'నే జూతా గా... నే వెళ్లినప్పుడేమయ్యిందంటే...' అంటూ మొదలెడ్తాడు.

చేరిన్రోజునుంచీ మూడోరోజైన యీరోజున విదేశాల్లో తీసిన ఫోటోలు, అక్కణ్ణుంచితెచ్చిన మరికొన్ని బొమ్మల పుస్తకాలు (రెండోవి కొద్దిమందికే యిస్తాడు), తను దిగిన యింటివాళ్ళతో తనుదిగిన ఫోటోలు...యివన్నీ బ్రీఫ్ కేస్‌లో వేసుకొచ్చాడు.

ఈ బ్రీఫ్‌కేస్ ఫారిన్‌రిటర్న్డ్ మనస్సుకు ప్రతిబింబం వచ్చిన కొత్తలో అంటే మూణ్ణెల్లవరకూ దీన్ని చాలా నీట్ గా వుంచుకుని మరో అరగంటలో ఎయిరిండియాలో కూర్చోబోయేవారిలాగ హడావిడి పడ్తారు. ఈ సమయంలోనే 'మళ్ళీ' అమెరికా తిరిగెళ్లిపోతాను' అని భయపెడుతూ వుంటారు. ఆ తర్వాత కొన్నాళ్ళకి బ్రీఫ్ కేస్ రోజూ వెంటేసుకుని తీసుకురారు. చేతులూపుకుంటూ భుజాలెగరేస్తూ వస్తారు. ఒకరోజింటినుంచి తీసుకురావటం మర్చిపోయో, మరోరోజు డిపార్టుమెంట్‌నుంచింటికి తీసుకెళ్ళడం మర్చిపోయి మర్రోజు చేతులూపుకుంటు రావటమో జరుగుతూ వుంటుంది. ఈ సమయంలోనే 'నేనిండియాకు రావటంలో తప్పుజేశాను' అంటారు; అంటే 'ఇండియాకు రావటం నేంజేసిన తప్పు' అనర్థం. అనర్థం తెచ్చిపెట్టింది కూడాను అనంటారు. తర్వాత కొన్నాళ్ళకి బ్రీఫ్‌కేస్ సంగతి మర్చిపోతారు. ఇంట్లో వాళ్ళు దాంట్లో పూసలపొట్లాలు, అర్లీక సామాన్లూ పెట్టుకుంటూవుంటారు. ఇవన్నీ చూస్తూనే వుంటాడు. భుజాలెగరెయ్యటం కూడా కొంత తగ్గుతుంది. ఈదశలో 'ఇండియాలో రిసెర్చి చెయ్యటంపడదు. ఫారిన్ తిరిగొచ్చినవాళ్లసలు ప న్లే య్యా లే రు,

అందుకే ఖొరానా, నార్లికార్, చంద్రశేఖర్‌లాంటి వాళ్లక్కడుండిపోయారు. నేను బుద్ధి తక్కువై యిక్కడకొచ్చాను' అంటాడు. అతగాడనేదక్షరాలా నిజం; అందులో చివరక్షరాలు మరీను.

వీటన్నిటి తర్వాత నాలుగో దశ. ఈ దశలోకొచ్చాక 'ఆఁ...వాడిబొంద...వాడికేం తెల్సు? స్టాన్‌ఫర్డ్‌గానీ ఆక్స్‌ఫర్డ్‌గానీ వెళ్లాడా? మరింకా కబుర్లెందుకు? నోరు మూసుక్కూర్చోక. పోనీ మాంచెస్టర్‌గానీ రాచెస్టర్‌గానీ వెళ్లాడా? అదీలేదు; మరి ఏం మాట్లాడకూడదంతే' అంటారు. ఈ దశలోకొచ్చాక యిండియాలో వుండటం తప్పనిసరని తేల్చేసుకుంటారు. అయినా తిడుతూనే వుంటారు — దేశాన్నో విదేశం వెళ్లని వాళ్లనో.

పద్మనాభం డిపార్ట్‌మెంటుకు వెడుతూండగా మధ్యదారిలో మరో బ్రీఫ్‌కేస్ తీసుకొస్తున్న పెద్దమనిషి కనిపించాడు. పెద్దమనిషికూడా అమెరికా నుంచి తిరిగొచ్చిన 'పెద్ద' మనిషి. ఇద్దరూ 'హాయ్'. 'హాయ్' అన్నారు.

'నువ్విక్కడున్నట్టు లండన్‌లో డాక్టర్ మద్దేల చెప్పాడు (అతగాడిపేరు మద్దేల సూర్యప్రకాశరావు); నేను కొన్ని గంటలు మాత్రం లండన్‌లో వున్నాను ... ఏమిటి వార్తలు?' అన్నాడు పద్మనాభం.

వార్తలు చెప్పటం సాగించాడు పెద్దమనిషి '...నుంచి వార్తలు వింటున్నారు' అన్నట్టు మధ్యమధ్యలో 'నేం చెబుతున్నాను ... నేం చెబుతున్నాను' అంటున్నాడు.

పెద్దమనిషి అమెరికా నుంచి వచ్చి 'పూల్' లో దిగాడు. దేశాలు పట్టిన విజ్ఞానవేత్తల్నీ సాంకేతిక నిపుణులనూ దేశానికి రప్పించేందుగ్గాను భారత ప్రభుత్వం 'పూల్' నొకదాన్నేర్పరచింది. 'మిమల్ని పూ(వు)ల్లోబెట్టి పూజిస్తాం... రండి' అని వీళ్ల నాహ్వానిస్తారు. ఇందులో వున్నన్నాళ్లూ యేదో వుడతాభక్తిగా యిచ్చిన సొమ్ము వీరికి ముడుతు వుంటుంది. ఇదే ఫారిన్‌రిటర్న్‌నిరుద్యోగికీ, స్వదేశీనిరుద్యోగికీతేడా. ఫారిన్‌రిటర్న్డ్ నిరుద్యోగి నిరుద్యోగ పర్వంలోకూడా కొంత జీతంలాంటి దిస్తారు. ఇది స్వదేశీ చిరుద్యోగి జీతాన్ని పొక్కొక్కప్పుడు స్వదేశీ గురుద్యోగి జీతాన్ని కూడా మించుతుంది. ఈ పూళ్లోచేరి పక్రటొండు సంవత్సరాలుండి వుద్యోగం వకటి వెతుక్కుని వెళ్లిపోతూవుంటారు. ఈ పూల్ విజ్ఞానవేత్తల పూల్ అనేందుకు యిండియాలో చదివిన వాళ్లనికూడా వేసుకుంటారుగానీ అలాంటి వాళ్ళు చాలా తక్కువ సంఖ్యలో వుంటారు.

ఈ పెద్దమనిషి పూలాఫీసరు. తను పూల్లో చేరాడు; తన పిల్లని స్కూల్లో చేర్చాడు రైమ్‌కోసం (నర్సరీ రైమ్స్ చెప్పే స్కూలండీ అది). తనిప్పుడుద్యోగం వెతుక్కుంటున్నాడు. పూల్లో చేరినవాళ్లు వుద్యోగస్తులు కారుమరి (ఉద్యోగం లేకుండానే ఆఫీసర్లౌతారు) అంతేగాక పూల్ వుద్యోగాలిప్పించదు. ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజిలో రిజిష్టర్జేసుకుని వుద్యోగం వెతుక్కున్నట్టే పూలాఫీసర్లుకూడా వుద్యోగాలు వెతుక్కోవాల్సిందే.

పెద్దమనుష్యు లిద్దరూ మాట్లాడుకుంటూ వుండగా మరోవ్యక్తి వచ్చాడు. ఇతగాడో చిన్నవాడు. ఇదే ఇన్‌స్టిట్యూట్‌లో పిహెచ్. డి. డిగ్రీ నాలుగు నెలల్రకితం తీసుకున్నాడు. ఉద్యోగం యింకా రాలేదు, పిహెచ్. డి. థీసిస్ సబ్మిట్ చెయ్యంగానే అంతవరకూ వచ్చే రెండొందలేభై స్కాలర్‌షిప్పు తీసేసుకున్నారు. 'ఏదైనా చిన్నుద్యోగం యిప్పించండి' అని ప్రొఫెసర్నడిగితే, పిహెచ్. డి. వచ్చేదాకా 'డిగ్రీరానీ... పోస్టు డాక్టరల్ ఫెలోషిప్పిప్పిస్తాను'అని, అదొచ్చాక —

'అబ్బే...యిదెందుకు...ఫాకల్టీ పొజిషన్లకి అడ్వర్టయిజ్‌మెంటొచ్చినప్పుడు తీసుకుంటాను...వేచివుండు' అని లేచి నుంచుని కూర్చున్న చిన్నవాణ్ణి లేపేవాడు. ప్రొఫెసరిట్లా అనటం వెనకాలోకథుంది. చిన్నవాడు స్వంతంగా వో పేపర్రాసి స్వంతడబ్బుతో పోస్టేజి ఖర్చులుపెట్టి ఆపేపర్ని ఫారిన్ జర్నల్‌లో ప్రచురించాడు. ఆ పేపర్లో ముందుగా ప్రొఫెసర్ పేరెట్టకుండా ప్రొఫెసర్ పేరు ముందు తనపేరుపెట్టాడు. అదీ అతగాడ్చేసిన అపచారం (దీన్నే రిసర్చిలో 'ముందు వెనకల' రాద్ధాంతం అంటారు) అందుకే ప్రొఫెసర్‌గార్కి చిన్నవాడంటే అపేక్ష లేదు; అతగాడి విషయంలో వుపేక్ష చూపిస్తున్నాడు. కానీ ప్రొఫెసర్‌గారి యీమాట ఆధారంగా రాబోయే వుద్యోగంకోసం కాచుకూర్చున్నాడు చిన్నవాడు. ఈ ఉద్యోగాన్ని నమ్ముకుని, నమ్మకం చెదిరినప్పుడు బెదిరిపోతూ మరికొన్నిచోట్ల కప్లయ్‌జేస్తూ యీ ఇన్‌స్టిట్యూట్ ప్రాంతంలోనే కూర్చున్నాడు. కానీ ప్రతి అప్లికేషన్లోనూ 'ఏయే దేశాలడుగుబెట్టావ్?' అని అడుగుతుంటే ఆ 'కాలం' వదిలేస్తూ వుండడంవల్లే తనకు కాలం కలసిరావటంలేదనీ, అది నింపితే తప్ప వుద్యోగం రాదనీ నిశ్చయించుకున్నాడు. అందుకే అప్పుడప్పుడూ ఫారిన్ యూనివర్శిటీల కప్లయ్‌జేస్తూ, సాధ్యమైనంత వరకూ విదేశాలు తిరిగొచ్చిన వాళ్లతో తిరుగుతూ వుంటాడు. అందుకే పూల్లో వున్న పెద్దమనిషిని అప్పుడప్పుడూ 'హలో' అంటూ వుంటాడు. పెద్దమనిషి మాత్రం 'హాయ్' అంటాడు. 'నీకేం? ! నీ పని హాయిగానేవుంది' అని నిట్టూరుస్తాడు చిన్నవాడు. పూల్లోవున్న 'పెద్ద' మనిషికి కొంత 'మనీ' వస్తోంది; యేమాత్రం పని లేదు. చిన్నవాడికి రెండూ లేవు. ఎప్పుడూ డిపార్టుమెంటులో దరఖాస్తుల కాపీల్లాగుతూ, అప్పుడప్పుడూ పెద్దమనిషితోబాటు ఇన్‌స్టిట్యూట్‌లోని కేంటీనుకు వెళ్లి కాఫీలాగుతూ, తాపీగా కబుర్లు చెప్పించుకుంటూ వుంటాడు. పెద్దమనిషి కబుర్లుచెప్పి కొన్ని అభయాలిచ్చి, మరి కొన్ని భయపెట్టే విషయాల్జెప్తాడు. ఆ రెండోకోవకు చెందినమాట — 'అబ్బే లాభంలేదు...మీరు అమెరికా వెళ్లిరండి' అన్నది. ఇలాంటి మాటలని చిన్నవాణ్ణి వేపుకు తింటాడు. ఇవి విని విని చిన్నవాడు పోస్టాఫీసు వేపుకు పోతాడు, ఫారిన్ కప్లయ్‌జేసే ప్రయత్నంలో ప్రథమ భాగంగా.

ఈ చిన్నవాడొచ్చి పెద్దమనిషి వి 'హలో' అన్నాడు. పెద్దమనిషి చిన్నవాణ్ణి పద్మనాభానిక్కూడా పరిచయం చేశాడు.

'ఇక్కడెందుకు చేశారు పి. హెచ్. డి? ఫారిన్ వెళ్లి చేసి రాకపోయారా?' అన్నాడు పద్మనాభం పైపు నోట్లోపెట్టి బయటకు తీసి పైపు వెనకభాగం దవడకేసి రాచుకుంటూ.

'చాలా తప్పు పనిచేశారు' అన్నాడు పద్మనాభం మళ్ళీ.

'అవును. అదే నేంజేసిన తప్పు' అన్నాడు చిన్నవాడు మూలుగుతూ. చిన్నవాడు మూలుగుతుంటే పెద్దమనుషులు కులుక్కున్నారు. తాటికాయ వుందేమోనని చుట్టూ చూశారు.

'ఇక్కడెక్కడా తాడిచెట్లు లేనట్టున్నాయ్. ఉంటే అక్కడికెళ్లి నిలబడదాం ...తాటికాయ దొరుకుతుంది' అన్నాడు పద్మనాభం,

మూలుగుతున్న చిన్నవాడి అహం దెబ్బతింది; మొహం కందిపింది, ఈలోపల మెదడుకో ఆలోచనందింది. దాంతో—

'అయ్యా!' అన్నాడు.

'య్యా' అన్నాడు పద్మనాభం.

'మీరు చదివిన దేశంలోని చాలా యూనివర్సిటీల్లో పిహెచ్.డి. డిగ్రీ తెచ్చుకునేందుకు చేయాల్సిన పనుల్లో డిజర్టేషన్ ఒక భాగమేకదా...పార్షియల్ ఫుల్‌ఫిల్‌మెంట్...కొన్ని కోర్సుల్తీసుకుని వాటికి జమ కట్టించుకుని తర్వాత భాగంగా డిజర్టేషన్ సబ్మిట్‌చేస్తారు. కానీ యిక్కడ కోర్సు వర్కేంలేదు; కొన్ని కొన్నిచోట్ల సోర్సాఫ్ యిన్‌స్పిరేషన్ వుండదు...' అంటున్న చిన్నవాణ్ణడ్డుకుని—

'కోర్సు వర్కులేకుండా థీసిస్ సబ్మిట్ చెయ్యటమేమిటండి?! ఇక్కడ కోర్సు వర్కుండదా?!' అని ఆశ్చర్యంతో మూర్ఛబోయినంత పన్జేశాడు పద్మనాభం. పద్మనాభం మూర్ఛబోయినా యీ చర్చ

# ఫారిన్...

యింతటితో ఆపదల్చుకోలేదు చిన్నవాడు.

'మూర్ఛబోకండి...పోయినా లేపి మీకీ విషయం చెబుతాను ... సంజీవ పర్వతం యీ ప్రాంతంలోనే వుందిట...అయ్యా... కోర్సు వర్కుండదు. కానీ అవన్నీ చదువుకోవటం జరుగుతోంది. అయినా వాటికి క్రెడిట్ రాదు. ఇంతాచేసి థీసిస్‌రాసి సబ్మిట్ చేస్తే దానికి డిగ్రీ యివ్వవచ్చని ఫారిన్ ప్రొఫెసర్లు సర్టిఫికెట్టివ్వాలి. ఇండియాలోని ప్రొఫెసర్ గైడ్‌గా వుండొచ్చుగానీ ఆ గైడే థీసిస్ గురించేం చెప్పకూడదు. చివరికి మననేం చెప్పనివ్వరుగదా అని మొదట్నుంచే యేమీ చెప్పరు కొందరు 'మార్గదర్శకులు' (గైడ్లు). ఒకవేళ అలాంటి వాళ్లు చెప్పినా మరో యిద్దరు ఫారిన్ ప్రొఫెసర్లు డిగ్రీ యివ్వవచ్చని చెబితేగానీ డిగ్రీ రాదు. కాని మీరు మీ యూనివర్సిటీ వాళ్లదగ్గరే చదువుకుంటూ, వాళ్లదగ్గరే మీ అనుమానాల్తీర్చుకుంటూ వాళ్లకే మీ థీసిస్ సబ్మిట్ చేస్తారు. అందువల్ల మీ డిగ్రీ తక్కువని నేనటంలేదు. ఎవరి విషయంలో యెక్కువ రిస్కుందో ఆలోచించమంటున్నాను ... అంతే' అని చిన్నవాడెళ్లిపోయాడు.

పద్మనాభం ముఖం వాచింది ... ముఖమంతా చేత్తో తడుముకుని —

'వాట్?...ఇతగాడు వేసింది చివాట్లా?' అనుకుని తర్వాత 'షీయూ' అని అవతలివాడితో అని పద్మనాభం వెళ్లిపోయాడు.

చిన్నవాడిట్లా మాట్లాడటానికో కారణం వుంది. ౬ నెల్రోజుల క్రిందటే విదేశీ యూనివర్సిటీలోని ఒక పోస్టు కప్లయ్ జేశాడు. అప్లికేషన్ పంపినందుకెంతో సంతోషించామనీ, పోస్టివ్వలేనందుకు విచారిస్తున్నామనీ తెలియజేశారు. పోస్టివ్వలేక పోవటానికి కారణం తమ దేశంలో పిహెచ్.డి. తీసుకున్న వాళ్లప్లయ్ చెయ్యటం అని విశదీకరించారు. చిన్నవాడు మండిపడ్డాడు. 'ఇండియాలో పిహెచ్.డి. తీసుకున్న వాళ్లకంటే బయట డిగ్రీ పుచ్చుకున్న యిండియన్స్‌కు యిండియాలో డిమాండుంది. బయటవాళ్లూ అక్కడి వాళ్లకే యిస్తున్నారు. ఇంక ఇండియన్ డిగ్రీల్తీసుకున్న వాళ్లేమవ్వాలి?'—యివన్నీ వూహించుకుని పద్మనాభం దగ్గిర చిందులేశాడు...

వూళ్లో వున్న పెద్దమనిషికూడా తన డిపార్ట్‌మెంటుకు వెళ్లాడు. వెళ్లి రెండుత్తరాలు టైపు చేయించాడు. ఆ రెండింటిలో వకటొక యూనివర్సిటీకి, యింకొకటి మరో పెద్ద ఇన్‌స్టిట్యూట్‌కూ రాశాడు. అందులో తన అర్హతలన్నీ విశదీకరించాడు. తనను సెలెక్టు చేసుకునే అర్హతలన్నీ వారికున్నట్టు వివరించాడు. ఆ అర్హత వాళ్లకున్నట్లు చెప్పటానికో విధానం వుంది. 'మీ ఇన్‌స్టిట్యూట్‌లో ఫలానా సౌకర్యాలున్నట్టు తెలిసింది' అని మొదలెడ్తాడు. ఆ అవకాశాలు (లాబ్, ఎక్విప్‌మెంటు వగైరాలు) తనలాంటి వాడి చేతిలో సద్వినియోగమవ్వటమేగాక రాణిస్తాయని కూడా తెలియజేస్తాడు. రాణిస్తాయని రాసేస్తాడు కూడాను. స్వదేశీ నిరుద్యోగికీ ఫారిన్ రిటర్న్డ్ నిరుద్యోగికీ (యితగాణ్ణి వూలాఫీసరని పిలుస్తారుగదా) యిందే తేడా. స్వదేశీ నిరుద్యోగి అడ్వర్టయిజ్‌మెంటు లేందే అప్లయ్ చెయ్యడు. ఫారిన్ రిటర్న్డ్ నిరుద్యోగి అడ్వర్టయిజ్‌మెంట్ లేకుండానే ఇన్‌స్టిట్యూట్ పెద్దల దగ్గరకు నిర్భయంగా వెడతాడు. పట్టుకొచ్చిన డాలర్లమూట మోటుగావుంటే ప్లేన్‌లో కూడా వెడతాడు. ఇలా వెళ్లి పెద్దవాళ్లని కలుసుకోవటంవల్ల యితరుల అభిప్రాయాలు 'కలుసుకున్న వాడెక్కడ చదివాడు',



అన్న విషయంమీద ఆధారపడి వుంటయ్. ఈపని స్వదేశీ నిరుద్యోగిచేస్తే, 'కాకా' అంటారు. చెన్నపురిలో వుండొచ్చినట్టున్నా డంటారు; వెన్నపూస రాస్తున్నాడంటారు; చిన్నచూపు చూస్తారు. ఎవరిదగ్గరికెళ్తే వెడతాడో వాళ్ళూ అంతే; వెళ్ళగా చూసిన వాళ్ళూ అంతే. ఆపనే ఫారిన్ రిటర్న్డ్

## ఫారిన్...

నిరుద్యోగి చేస్తే అలాంటిదేం అనరు. 'దేశంలోవుండి సేవ చెయ్యాలనే వుద్దేశ్యంతో వున్నాడు మరి' అంటూ ప్రశంసా పత్రం పడేస్తారు.

ఈ దారిగుండా వెళ్ళినపుడు స్వదేశీ నిరుద్యోగికి వుద్యోగం దొరక్కపోతే—

'పాపం! యోగం తక్కువ కుదిరింది. ఎత్తులు పారలేదు; యిహ వమ్ములుండాల్సిందే' అంటారు.

అదే ఫారిన్‌రిటర్న్డ్ నిరుద్యోగికి రానప్పుడు—ఆ ఇన్‌స్టిట్యూట్ కదృష్టం లేదు. అతగాడికేంపోయింది? మళ్ళీ తిరిగి అమెరికా వెళ్ళిపోతాట్ట... దేశంలో వ్యవహారాలిలా అఘోరిస్తున్నయ్యనే అతగా డమెరికానుండి తిరిగొచ్చేటప్పుడే తిరిగెళ్ళటానికి ప్లేన్ టికెట్ కొనుక్కొచ్చాట్ట' అని అతగాడికి వుద్యోగం యివ్వనివాళ్ళేగాక దేశం మొత్తాన్ని దులిపి దుమ్మెత్తిపోస్తారు. ఈ నిరుద్యోగులిద్దరి మధ్యా యింత భేదం వుంది; యిద్దర్నిగురించి యిట్లా వాదం చేసుకుంటూరు మిగతావాళ్ళు.

...పూలాఫీసరు కుద్యోగం వచ్చింది. ఈ యిన్‌స్టిట్యూట్‌నుంచి వెళ్ళిపోతున్నాడు. స్వదేశీ నిరుద్యోగికింకా వుద్యోగం రాలేదు. పూర్వాశ్రమంలో పూలాఫీసర్‌గావున్న పెద్దమనిషిని రైలెక్కించి మరో రిసర్చి స్కాలర్‌తో స్టేషన్నుంచి తిరిగొస్తున్నాడు స్వదేశీ నిరుద్యోగి. ఈ రిసర్చి స్కాలర్ రెండు మూణ్ణెల్లలో థీసిస్ సబ్మిట్ చెయ్యబోతున్నాడు. నాలోజుల్నాడే కెనడాలోని ఒక యూనివర్సిటీనుంచి పోస్టుడాక్టరల్ రిసర్చికి అవకాశం వుండొచ్చునన్న ఆశాభావాన్ని కలిగిస్తూ వో వుత్తరం వచ్చింది. ఇంతవరకూ ఫారిన్‌రిటర్న్డ్ వ్యక్తుల గురించిన వుద్దేశాల్లో తటస్థంగా వుండేవాడు. కానీ పైన చెప్పిన వుత్తరం వచ్చిన దగ్గర్నుంచీ స్వదేశీ నిరుద్యోగి బాధపడుతూ తన సొదంతా చెప్తుంటే—

'లాభం లేదండీ...వకసారి ఫారిన్ వెళ్ళొస్తే నయం!' అంటున్నాడు.

ఇప్పుడు స్టేషన్నుంచొస్తూ కూడా రిసర్చి స్కాలర్ యీ ప్లేటే పెట్టాడు. 'ఏమైనా వకసారి ఫారిన్ వెళ్ళొస్తే నయమండీ' అన్నాడు. నిరుద్యోగి చింతులొక్కాడు. ఇతగాడికీ అలవాటు చిన్నప్పు

---

## జయభాదురికి పెళ్ళయిందా?

## కె. వి. ఇకలేరు!

## ఫైనాన్స్ కార్పొరేషన్ కొత్త డైరెక్టర్లు!

నటించిన తొలి చిత్రంతోనే ప్రేక్షక హృదయాల్లో అపూర్వ స్థానం సంపాయించుకొన్న నటి జయభాదురికి వివాహం అయిందనే వార్త ఒకటి వెలువడింది. ఈ వార్త పరిశ్రమలోని వార్ని, ప్రేక్షకుల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది. పూనా ఫిలిం యిన్‌స్టిట్యూట్‌లో, చేరటానికి ముందే ఆమె వివాహం చేసుకున్నదిట. ఆమె భర్త కలకత్తాలో ఇంజనీర్.

పాపం, జయభాదురిని యీ వదంతి అంతటితో వదిలి పెట్టలేదు. ఆ భర్త ఆమెను నానాబాధలూ పెట్టాడని, అవి భరించలేక అతనికి దూరమై బ్రతకాలని జయ నిర్ణయించుకుందనీ ఆ వార్తలో ఉంది. మీకు వినాలని ఉత్సాహం ఉంటే ఆమె భర్త పేరు భాస్కర్ చౌదరి.

జయభాదురి యిప్పుడు నటిగా తారాపథానికి చేరుకుంది గనుక, ఆమెను తిరిగి తన దగ్గరకు తీసుకు వెళ్ళాలనుకుంటున్నాడట. కాని, జయ విడాకులు కోరుతున్నదిట. జయభాదురి, అమితాబ్‌బచన్ కలిసి 10 లక్షల రూపాయలు అతనికి యిచ్చి, ఆమెను అతని నుంచి విడిపించాలని ప్రయత్నిస్తున్నారు. కాని అతను ఒప్పుకోవటం లేదు. ఈ వార్తమీద జయభాదురి రియాక్షన్ ఏమిటి?

ఈ విషయం అడిగితే జయ పగలబడి నవ్వి—'నాకు తెలిసింది ఒకే ఒక భాస్కర్ చౌదరి. అతను మా యిన్‌స్టిట్యూట్‌లో మా బాచ్ ఏక్టింగ్ స్టూడెంట్. మేము మంచి స్నేహితులం. అతను త్వరలో ఇన్‌స్టిట్యూట్‌లో లెక్చరర్‌గా చేరబోతున్నాడు. పాపం భాస్కర్ చౌదరి కెరీర్‌కి ఇది ఎఫెక్ట్ కాకూడదని ఆశిస్తాను' అన్నది.

* * *

సెప్టెంబరు 17 వ తేదీ ఉదయానే విషాద వార్త వినవలసి వచ్చింది. అది ప్రముఖ దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి పోయారనేది ...

పరిశ్రమలో అంతా ఆయన్ని కె. వి. అని పిలుస్తారు ఆప్యాయంగా. మనిషి ఎంత ఆజానుబాహుడో, అంత గంభీరుడు. మంచి డిసిప్లిన్ కలిగిన వ్యక్తి. భక్తపోతన, యోగి వేమన, గుణసుందరి కథ, పాతాళభైరవి, జగదేక వీరుని కథ, మాయాబజారు, శ్రీకృష్ణార్జున యుద్ధం, శ్రీకృష్ణసత్య వంటి విశిష్ట పౌరాణిక జానపదాలే గాక— పెద్దమనుషులు, పెళ్ళినాటి ప్రమాణాలు, దొంగరాముడు వంటి ఉత్తమ సాంఘికాలకు కూడా దర్శకత్వం వహించి దర్శకుల శ్రేణిలో తనకొక ప్రత్యేకతను సృష్టించుకున్నారు.

శ్రీ కె. వి. పోవటం తెలుగు చలనచిత్ర పరిశ్రమకు తీరనిలోటు!

* * *

కేంద్రప్రభుత్వ సమాచార మంత్రిత్వ శాఖ— ఫిలిమ్ ఫైనాన్స్ కార్పొరేషన్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌ని అక్టోబరు మొదటి తేదీ నుంచి ప్రారంభమయ్యే కొత్త సంవత్సరానికి యీ దిగువ వారిని ఎన్నుకున్నది.

చైర్మన్‌గా శ్రీ బి. కె. కరంజియా కంటిన్యూ అవుతారు. ఎం. టి. వాసుదేవన్ నాయర్, శ్రీమతి తేజీబచ్చన్, హృషికేశ్ ముఖర్జీ, డాక్టర్ వి. కె. నారాయణమీనన్, మోహన్ రాకేష్, ఎస్. ఆర్. వకీల్, ఎం. ఏ. యస్. రాజన్— యితర సభ్యులు.

—మోహన్‌కుమార్

ట్నుంచి వచ్చింది. తమకొచ్చావల్సిందివ్వకి బోతే తమ అసంతృప్తినీ, అభ్యంతరాన్ని చిన్నపిల్లలు చాలారకాలుగా చూపిస్తారు. కొందరు యింటికప్పెకే ముప్పుతెస్తారు; మరికొందరు కాళ్ళు నేలమీద వేగంతో తాటేస్తూ చిందులొక్కుతారు. స్వదేశి నిరుద్యోగి రెండోకోవకు చెందినవాడు; యిప్పటికీ ఆ దోవనే వెడుతున్నాడు. కాస్సేపు చిందులొక్కి—

'ఏమిటండీ మనం వో యేడాదక్కడి కెళ్ళి నేర్చుకునేది? అసలు వెళ్ళేం చేశా రన్నది గాకుండా వెళ్ళారా లేరా అనే చూస్తున్నారిప్పుడు. అక్కడేం చెయ్యకుండా వెళ్ళిరాగానే అయిపోయిందిటండీ? అడిగే వాళ్ళు లేగ్గానీ...మరీ యీరోజుల్లో సిలోన్ వెళ్ళినా, ఆఫ్రికావెళ్ళినా, మరో చిన్నదేశం వెళ్ళి తిరిగొచ్చినా ఫారిన్‌రిటర్న్డ్ గావటమే గాకుండా విజ్ఞానిగాకూడా పరిగణిస్తున్నారు ...అసలు పోస్టిచ్చే ముందు 'ఫారిన్ వెళ్ళావా? యస్‌ఆర్‌నో? నో అయితే యెందుకెళ్ళలేదు. యస్సయితే యేంలేదు; వుద్యోగంవుంది; అది నీది అనటం ఫ్యాష నైపోయింది. ఈ ఫ్యాషనిప్పుడు మితి మీరింది' అని చిటపట్లాడుతూ చివాట్లు పెట్టాడు.

రిసెర్చి స్కాలర్ చిన్న బుచ్చుకుని నొచ్చుకున్నా నిరుద్యోగి చెయ్యిపుచ్చుకుని మెచ్చుకుంటున్నట్టు చూస్తూ—

'మీర్చెప్పింది నిజమే...కానీ యిట్లా ఫారిన్ వెళ్ళొచ్చావా అడగటం, వెళ్ళిరావా లనటం, వెళ్ళందే పోస్టు రాదనటం యిప్పుడే మొదలవ్వలేదు. ఎప్పుడో పురాణ కాలంలోనే వుందీ అలవాటు ... మీకా కథ తెలిసినట్టు లేదే', అన్నాడు.

'ఏం కథ' అన్నాడు స్వదేశి నిరుద్యోగి.

వీళ్ళెక్కిన బస్సు నిరుద్యోగి హాస్టల్ దగ్గరి కొచ్చింది.

'సరే...మీ హాస్టలొచ్చింది దిగెయ్యండి 'ఫారిన్‌మేనియా' పురాణకాలంలోనే వుందన్న సత్యాన్ని రేపు నిరూపిస్తాను' అన్నాడు రిసర్చి స్కాలర్.

బస్సాగింది ... నిరుద్యోగి తన బస కెళ్ళాడు.

ఈ అయిదేళ్ల కూతుర్ని తీసుకుని ఎవరికీ తెలియకుండా యిల్లు వదిలి రైలు పట్టాలమీదకు వెళ్ళి, కూతుర్ని తన నడుంకు చీరకొంగుతోగట్టిగా కట్టుకుని, అప్పుడే వస్తున్న రైలు క్రింద పడిందట ఫలితంగా ఆమె, ఆమె కూతురూ తునాతునకలై పోయారట.

### కీచులాటలకి పరిష్కారం ఆత్మహత్య !

ధర్మపురికి చెందిన పాపిరెడ్డి పట్టి గ్రామంలో 25 ఏళ్ళ జలరామన్ వో మంగలిషాపు (కులవృత్తి)

## ఒకవారం విపరీతం

(55వ పేజీ తరువాయి)

పెట్టుకున్నాడట. అతనికి పోయినేడు 21 ఏళ్ళ పద్మిని అనే అమ్మాయితో వివాహం అయిందట. కొన్నాళ్ళపాటే జంట చాలా ఆనందంగా వుండి, ఆనక అప్పుడప్పుడు కీచులాడుకోనారంభించారట. ఈ కీచులాటలు రానూ రానూ నిత్యమై, దుర్భరంగా తయారయిందట. ఈరకంగా రోజూ పోట్లాడుకుని చచ్చే బదులు చేతికందిన విషం త్రాగి ఏల చావ కూడదూ అని భార్యాభర్తలిద్దరూ ఆలోచించుకుని అదే మంచి పద్ధతిగా వో వొప్పందానికొచ్చారట. ఈ మారణహోమానికి ముందు ఒకేసెక్సు్ల్‌లో విహారయాత్రకు వెళ్ళాలని కూడా యీ దంపతులు నిశ్చయించుకున్నారట. అనుకున్నమేరకు వెళ్ళి, ఒకేసెక్సు్ల్‌ వెళ్ళి, వోరాత్రి సంతోషంగా గడిపి మర్నాడు ప్రొద్దున్న విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నారట.

### విషాహారమా?

మధురలో మారియమ్మగుడికి 45 ఏళ్ళ విజయలక్ష్మి అనే ఆవిడ వెళ్ళి, గుడి చుట్టూ ప్రదక్షిణం చేస్తూ మైకం వచ్చినట్టనిపించి గమ్మున కూర్చుండి పోయిందట. కూర్చున్న మనిషి కూర్చున్నట్టే, చనిపోయిందట. అదే సమయంలో ఆవిడ కూతురు 18 ఏళ్ళ కమల వోసినిమాహాలు ప్రాంతంలో వస్తుండగా తలతిరిగినట్టనిపించి, వో రిక్షా ఎక్కి అందులో కూర్చుని యింటికిబయల్దేరి, దారిలో ఆరిక్షాలోనే చనిపోయిందట. ఒకే సిద్ధంతో ఒకే టయిములో తల్లీ కూతుళ్ళిద్దరూ చనిపోడాన్నిబట్టి వీరు తిన్న ఆహారంలో ఏదైనా విషం కలిసి వుండుండాలని పోలీసు అభిప్రాయ పడుతోంది.

*　　　*　　　*

ఢిల్లీలో వో ఆడపిల్లల స్కూలులో 10వ తరగతి చదువుతున్న ప్రేమలత అనే 17 ఏళ్ళ హరిజన బాలిక శవం 8వ తేదీన వో మూతిలో దొరికిందట. కృష్ణాష్టమి రోజున ప్రసాద విషయంలో ఆమెకూ అక్కడి ప్రధానోపాధ్యాయునికీ ఏదో ఘర్షణ వచ్చిందట. ప్రేమలత హరిజన బాలికని ఆ ప్రధానోపాధ్యాయిని ప్రసాదం విషయంలో ఆమెకు అర్హత లేదని అన్నాడట. ఈ బాలిక శవాన్ని ఢిల్లీలో వూరూరంతా వూరేగించి చివరికి, ప్రధాని యింటికి కూడా వెళ్ళారట.. ఆ టయిములో ప్రధాని శ్రీమతి గాంధీ ఇంట్లో లేరట. ఇట్స్ నాచురల్.

### అప్పుల బాధ భరించలేక ఆత్మహత్య

ఈరోడ్డుకు చెందిన తణికాచలం అనే వో పోస్టల్ వుద్యోగి అప్పు బాధను భరించలేక, ఎదురీదలేక వేరే గత్యంతరం లేక తనింత విషం తిని, తన భార్యకు నలుగురు కూతుళ్ళకు, ముగ్గురు కొడుకులకూ కూడా తలో అంతా పెట్టాడట. పుదయాన్న పాలవాడు తలుపెంత బాదినా ఏవిధమైన సమాధానమూ రాకపోయేసరికి యీ విషయాన్ని అతను పోలీసులకు తెలియ జేస్తే వాళ్ళొచ్చి తలుపులు పగలేసి చూశారట. లోపల మొత్తం తొమ్మిది శవాలూ పడివున్నాయట. అన్యకార్యశతం కృత్వాపి భర్తా :...... చేయరాని పనులు వంద చేసయినా సరే, భార్యాపిల్లలను పోషించడమే భర్త కర్తవ్యం అన్న మనుధర్మ శాస్త్రం యీకాలానికి వర్తించదా! అయినా, శాస్త్రం అన్నం పెట్టగలదా!!

---

# ప్రముఖ దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి అస్తమయం

'భక్తపోతన, యోగివేమన, మాయా బజారు, దొంగరాముడు, శ్రీ కృష్ణార్జున యుద్ధం, పాతాళభైరవి' లాంటి ఉత్తమ చిత్రాలను పామర జనరంజకంగా చిత్రించిన ప్రముఖ దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి సెప్టెంబరు 16న, పరలోక ప్రాప్తిని అందుకున్నారు. ఆయన దర్శకత్వం వహించిన చివరి చిత్రం 'శ్రీకృష్ణసత్య.' గురువు పట్ల తనకున్న భక్తి, గౌరవాలకు చిహ్నంగా ఎన్టీరామారావుగారు తన 'కృష్ణసత్య'ని, రెడ్డిగారిచేత డైరెక్టు చేయించారు.

కె. వి. గారి ఆకస్మిక మరణం, చలనచిత్ర రంగాన్ని ఆందోళన పరిచింది. మురుగేశ ముదలియార్ వీధి నిండా చలనచిత్ర ప్రముఖుల కార్లు బారులు తీరి నిలబడ్డాయి. పరిశ్రమ అంతా వచ్చి, దుఃఖాశ్రువులు రాల్చారు. ఆనాటి సాయంత్రం 6 గంటలకి, కన్నమ్మపేట శ్మశాన వాటికలో అంత్యక్రియలు జరిగాయి.

### కె. వి. రెడ్డి జీవిత విశేషాలు

శ్రీ కె. వి. రెడ్డిగారి జన్మస్థలం తాడిపత్రి. రైతు కుటుంబంలో 1911 లో పుట్టారు. విద్యార్థి దశ నుండి కళ పట్ల ఆసక్తి, అనురక్తి వుండడం వల్ల యీ రంగ ప్రవేశానికి దారి తీసింది. బి.ఎస్.సి. ఆనర్సు. పట్టభద్రులు.

'స్క్రీన్‌ప్లే ఎలా వుండాలి అన్న అంశాన్ని శ్రీ రెడ్డి వద్ద నేర్చుకున్నాను. దొంగరాముడు, అప్పుడు మాతోనే ప్రతిరోజూ రెండున్నర వత్సరాలు కథపై చర్చ జరిపేవారు. ఒక జీనియస్ మనకి దూరమయ్యారు' అన్నారు అన్నపూర్ణా అధినేత మధుసూదనరావు.

'నా ఆప్తమిత్రుడు, ఒక ఉత్తమ దర్శ



కుడు వెళ్ళిపోయాడ' అంటూ భోరున ఏడ్చారు పి. పుల్లయ్య.

'సచ్చి మంచినీళ్ళు కూడా ముట్టడానికి మనసొప్పలేదు. నా జీవితాన్ని సక్రమ మార్గంలో పెట్టిన నా గురువు యింత త్వరలో మన నుండి తప్పుకుంటారనుకోలేదు. నాచిత్రాన్ని రెడ్డిగారి చేత డైరెక్టు చేయిద్దామనుకున్నాను' అన్నారు దర్శకుడు బాబురావు.

స్వయం కృషితో పరిపూర్ణ సాంకేతిక పరిజ్ఞానాన్ని ఆర్జించి, ఉత్తమ దర్శకునిగా పేరందిన రెడ్డిగారు అనేకమందికి మార్గదర్శకులయ్యారు. మరణించిన నాటికి, రెడ్డిగారి వయస్సు 62 సంవత్సరములు.

—శ్రీనివాస్

అపీ - ఇపీ . గా

## ఫేమస్ ఫిలిమ్ సర్క్యూట్ భాగస్వామి మరణం

నెల్లూరులో వెలసిన ఫేమస్ ఫిలిమ్స్ సర్క్యూట్‌లో భాగస్వామిగా వుండిన షిరాజ్ ఆలీ హకీం,,, కరాచీలో గతించారు. బొంబాయిలో వున్న ఫేమస్ సినీ లేబరేటరీని, మహాలక్ష్మి స్టుడియోస్‌ని ప్రారంభించింది, వీరే.

ఫేమస్ ఫిలిమ్స్ బ్యానర్‌లో శ్రీ సి. వి. రామానుజంతో కలిసి 'బాలాజీ' తెలుగు చిత్రాన్ని, పి. పుల్లయ్య దర్శకత్వంలో నిర్మించారు, ఆలీ హకీం స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మం గారికి ఆప్త మిత్రుడు. 'ధర్మపత్ని' చిత్రాన్ని నిర్మించి, ప్రప్రథమంగా నాగేశ్వరరావును బాల పాత్రతో పరిచయం చేసిందీయనే. స్టార్ కంబైన్స్ ఏ. రామయ్యగారితో కలిసి షిరాజ్ ఆలీహకీం 'కృష్ణప్రేమ'ను నిర్మించారు.

తెలుగు చిత్రాలను ప్రచారం చెయ్యడంలో శ్రద్ధ వహించేవారు. పైన పేర్కొన్న సంస్థలో భాగస్వామిగా చేరి, చిత్రాల పంపిణీలో నిమగ్నులైనారు. ఆరోజుల్లో ఫేమస్ ఫిలిం సర్క్యూట్ అంటే తెలియని వారు లేరు. —(ఒ. వి.)

* * *

డెహ్రాడూన్ ఆంధ్ర సమితి అధ్వర్యంలో థియేటర్ గ్రూప్ వారు మూకాభినయం చేశారు.

* * *

ఫ్రీప్రెస్ జరనల్‌లో న్యూస్ ఎడిటర్‌గా యుండిన శ్రీ సి. పి. రావుగారి అకస్మాత్ మరణమునకు బొంబాయి ఆంధ్ర మహాసభ కార్యవర్గము గాఢ సంతాపమును తెలియజేస్తూ, ఒక తీర్మానమును ఆమోదించిరి. (ఒ. వి.)

## శ్రీ కృష్ణాష్టమి జన్మోత్సవము [శ్రీ కృష్ణశ్శరణంమమ]

శ్రీ వేణుగోపాలుని ఆశీస్సులతో ప్రతిసంవత్సరం కార్వేటి నగరంలో వేణుగోపాలస్వామి ఆలయంలో జన్మాష్టమి వేడుకలు జరుగును.

ఉదయం ప్రత్యేక పూజలు; మధ్యాహ్నం శ్రీమతి వంగల ప్రభావతి భాగవతారిణి హరికథ, సాయంత్రం శ్రీ కృష్ణప్రియ, (రాజమహల్) నృత్య నివేదన. భక్తులందరూ విచ్చేసి భగవంతుని లీలా వినోదముల అలకించి, తిలకించి, తీర్థ ప్రసాదములు స్వీకరించి ధన్యులు కా ప్రార్థితులు. విరాళములు పంపగోరు వారు క్రింది విలాసమునకు పంపవలెను. (కార్వేటి నగరం పుత్తూరునకు ఆరుమైళ్ళదూరంలోవున్నది.)

కార్వేటినగరము సుప్రసిద్ధ క్షత్రియవంశమునకు రాజధాని—శాలివాహన శకం 1641 (1719ఎ.డి.) శార్వరీ సంవత్సరంలో అప్పటి ప్రభువైన వేంకట పెరుమాళ్ రాజు, కార్వేటి నగరమును కట్టించి రాజధానిని నారాయణ వనమునుంచి యిచ్చటికి తరలించెననియు శ్రీ వేణుగోపాలస్వామి ఆలయమును నిర్మింపజేసె ననియు సంస్థానములో వ్రాసియున్న వంశావళిలో పొందుపరచి యున్నది. శాలి వాహనశకం 1779 (1857 ఏ. డి.) లో నాటిపాలకుని ధర్మపత్నియగు వేంకటాంబ గోపుర నిర్మాణము 19వ శతాబ్దోత్తర భాగములో రాజైన కుమార వెంకట పెరుమాళ్‌రాజు, స్కంద పుష్కరణి నిర్మాణమును గావించినట్లు తెలియుచున్నది.

ఆలయ ప్రాంగణములోనే వున్న కోదండరాముని సన్నిధిలో ఏకశిలా నిర్మితమైన ప్రభా మండలాదులు నాటి శిల్పకళకు మచ్చుతునకలు.

—వి. ఏ. కె. రంగారావు, (మదరాసు)

## సన్మానం

పిప్పర యువశ్రీ ఆర్ట్ థియేటర్స్ వారు నాటక రచయిత శ్రీ భీసెట్టి లక్ష్మణరావును, దర్శకుడు శ్రీ నిట్టల కృష్ణమూర్తిగార్లను సన్మానించారు.

## కాంపిటీషన్

శంకర్స్ ఇంటర్ నేషనల్ చిల్డ్రన్స్ కాంపిటీషను ఈ సంవత్సరంకూడా ఏర్పరుస్తున్నారు. ఢిల్లీకి వ్రాసి వివరాలు పొందవచ్చు.

* * *

రాంచీ హిందూస్థాన్ స్టీల్ కాంని ఆంధ్ర సంఘం 'ప్రగతి' ఆగష్టు 12వ తేదీన ప్రఖ్యాత టేబిల్ టెన్నిస్ ఆటగాడు శ్రీ జి. జగన్నాద్‌గారిని ఘనంగా సన్మానించింది. (ఒ.వి.)

**పుస్తకాలు**

1. **ఇదెక్కడి న్యాయం:** బి.వి.ఎస్. అచ్యుత వల్లి—200 పేజీలు. యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్, వెల: 2—50.

2. **ఆమె వెలిగించిన దీపాలు:** కోమలాదేవి 214 పేజీలు. యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్, వెల: 2—50.

*

'మాలతి స్థితిగతు లెరిగి ఆమె ఆశయాల కొటంకి పరచనని హామీ ఇచ్చి తన వారి ఇష్టాలకి లొంగిపోయి కట్టుకున్న మాలతిని 'నిర్దాక్షిణ్యం'గా పొమ్మని చెప్పగల మామూలు భర్త 'రామనాథం'. 'తనూ 'స్త్రీ' గనుక, ఆరిటాకుముల్లు సామెత్యం తెచ్చుకుని 'అతనికి విలువనిస్తూనే' మెడిసిన్ చదువు తున్న తమ్ముడి ఆశ చంపలేక, బదిలీ అయిన భర్త వెంట పిల్లల్ని మాత్రమే పంపించి, ఉద్యోగం చేస్తూ వుంటుంది. ఐదేళ్ళకాలంలో ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబివ్వని భర్తని వెతుక్కుంటూ వెళ్తుంది మాలతి. అందరి బ్రతుకులు ఆనందమందిరాల్లై వుండగా తనూ తనపిల్లలకూ జరిగిన అన్యాయ మేమిటో గ్రహిస్తుంది మాలతి. ఏ కర్తవ్యం కోసం తానొక సమిధగా దగ్ధమయిందో ఆ కర్తవ్యంలో తిరిగి ఆత్మానందాన్ని పొందాలని భర్తను కలిసి పిల్లల్ని తన కప్పగించవలసిందిగా కోరుతుంది. పదేళ్ళ తరువాత భర్తతో మాట్లాడిన మాలతినుండి ఒకటే ప్రశ్న 'ఇదెక్కడిన్యాయం?' 'స్త్రీ' అంటే సంఘంలో వున్న విలువను— ఎత్తిచూపే విలువైన రచన యిది.

* * *

మాధవి పెళ్ళితో ప్రారంభమైన 'వసుధ' కథలో రామారావు పీటలమీద పెళ్ళి ఆగిపోవటంతో వసుధకి చదువుకోవాలనిపిస్తుంది. మెడిసిన్‌లో చేరుతుంది. ఆమెకింకా పెళ్ళవలేదు కాబట్టి, తన కోరిక వెల్లడించాలని హోష లుకు వస్తాడు రామారావు. వసుధ నిర్లిప్త ప్రవర్తన, 'జవాబులు' అతడ్ని మార్చుతాయి. తండ్రినెదిరించి యూనివర్సిటీలో చేరుతాడు. వసుధ తమ ప్రొఫెసర్ని ప్రేమించి పెళ్ళాడుతుంది. మళ్ళీ ఆమెకోసం వచ్చిన రామారావు పెళ్ళి సంగతి విని అసూయతో బాధపడతాడు. వసుధని ఆమె భర్త రాజేంద్రని చాటునుంచే చూస్తాడు. పి.హెచ్.డి కోసం ఫారెన్ (డెన్వర్) వెళ్తాడు. పెద్ద ప్రొఫెసరవుతాడు. ఏదో మీటింగుకి 'అట్లాంటా' వెళ్ళాడు. అక్కడే స్థిరపడిన వసుధని రాజేంద్రని కలుసుకుంటాడతను. అప్పటికి తన హోదా వారితో సమానమైనందుకు తృప్తిపడతాడు. కరెంటు పోయిన సందర్భములో వసుధ వెలిగించిన రెండు కొవ్వొత్తులను చూసి తన్మయుడవుతాడు. తిరిగి తమ వూరువెళ్ళి యాక్సిడెంటులో చని పోతాడు. అంతిమక్రియలప్పుడు రాజేంద్ర ద్వారా రెండు కొవ్వొత్తుల్ని పంపిస్తుంది వసుధ.

కథలో వసుధా రాజేంద్రల ప్రణయం మధురంగా వుంది. మాధవి బిడ్డను పెంచుకునే సన్నివేశం పుస్తకానికెంతవరకు అవసరమో రచయిత్రికే తెలియాలి. అలాగే అటు రామారావు మీద శారదను ప్రయోగించిన తీరు వ్యర్థమనుకోవాలి. రామాయణంలో పిడకలవేట వంటి—ఈ రెండు సన్నివేశాలూ పాఠకుల్ని ఆకట్టుకోవు. అవి లేకపోయినా కథకి లోపం రాదు. రచయిత్రి తమ ఇంగ్లీషు పాండిత్యాన్ని తెలుగు పాఠకులకి రుద్దటం భావ్యం కాదు. తెలుగు నవలలు చదివేవారిలో చాలామంది 'తెలుగు' మాత్రమే తెలిసిన వారుంటారని తెలుసుకోవటం మంచిది.

—కృష్ణ.




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.



వెంకన్న కోట
బొమ్మల కథ: బాపు
19
నాకేం తెలీదు - నీ తోడురోయ్ నాకేం తెలీదు
నువు చెప్పు - నే పీకని కొస్త నొక్కితే నీ నోరు చెబుతుంది
వెంకట్రావణ్ణ అక్కడే టేబుల్ క్లాత్ తీసుకొని గుండు మీసాలోడి మొహం కప్పెద్దామని రెడీగా వున్నాడు
మెల్లగా కిటికీ దగ్గరికి వెళ్ళాడు
ఇప్పుడు దా నీ పని చెబుతా
హా!
గుండు మీసాలాడు వెంకట్రావణ్ణ మీదికి దూకబోగా వెంకట్రావణ్ణ తమాషాగా పక్కకి తప్పుకున్నాడు
కిటికీ లోంచి గుండు మీసాలోడు తలక్రిందులుగా నేల మీదికి వేగంగా జారాడు - అసలే నున్నటి గుండు .........
(ఇంకా ఉంది)

